# సంగీతసావిత్రి

సుందరమైన చిత్రపటములతో చక్కని కీర్తనలతో విరాజిల్లుచున్నది. వెల 0—12—0

# పాదుకాపట్టాభిషేకము

చక్కని భక్తిరసప్రధాననాటకము. వెల 0—12—0

# భయంకరనారీపిశాచి

గ్రంథకర్త:—వాడ్రేవు మల్లపరాజుగారు

(రెండవకూర్పు)

ఇందు కథానాయికి దుర్గ చేసినపనులు యెటువంటివారికైనను హడలుపుట్టించకమానవు డిటెక్టివు సుందరరావు పన్నినపన్నాగములను దుర్గ చిందరవందర చేయుట- (మహాశ్చర్యము) అద్భుతమైన బిలములలో దుర్గ నివసించుట-బిలపరిశోధన చక్కగా పోషింపబడినది ఇదివరకు మీరు చదివిన పరిశోధకనవలను మించియుండుననుట కెంత మాత్రము నతిశయోక్తి కాదు. వెల 1—0—0

# శతకంఠరామాయణము

గ్రంథకర్త- ద్రోణంరాజు సీతారామారావుగారు

ఇది మర్దనకవిచే రచియింపఁబడిన సీతావిజయము అను పద్యకావ్యము ననుసరించి వ్రాయబడిన నాటకము. వెల 0—10—0

వలయువారు:—

## టి. వి. రమణయ్య అండు బ్రదర్సు,

నేషనల్ బుక్కుడిపో,

రాజమండ్రి.

శ్రీ

# సరసత్రయము



సంఘదురాచారము

గ్రంథకర్త.

వెలుకపల్లి వేంకటరామయ్యగారు.

వి. వి. రమణయ్య అండు బ్రదర్సు,

నేషనల్ బుక్కుడిపో, రాజమండ్రి.

మొదటికూర్పు 1000 ప్రతులు.

దేశీయ విద్యాలయ ముద్రణాలయమున ముద్రింపబడియె.

1926

కాపీరైటు రిజిష్టరు

వెల 0-12-0

# విజ్ఞప్తి

ఈపరవిక్రియమను నాటకము సంఘదురాచారముల వెల్లడించు నుద్దేశ్యముతో వ్రాయబడినది. ఇందుగ్రాంధిక గ్రామ్యములు రెండు వాడబడినవి. ఈనాటకము మ॥ రా॥ రా॥ శ్రీ T. V. రమణయ్య అండు బ్రదర్సు నేషనల్ బుక్కుడిపో వారు నాకు గొంతధనంబొసంగి ముద్రిణాధికారము తాము వహించిరి. ఇందలిదోషముల దెలిపినముందు కూర్పుసవరించుకొందును.

16—1—1926
వెలుగుబంద

ఇట్లు
చెఱుకుపల్లి వేంకటరామయ్య





# ప్రకటన

లిఖితరూపమైన, మా అనుమతిని పొంది ప్రథమున ప్రదర్శించు నాటకసమాజము వారికి సువర్ణపతకము బహుమానము.

ఇట్లు

ప్రకాశకులు.





# ఈనాటకమునందు వచ్చుపాత్రలు.

## పురుషులు.

సూత్రధారుఁడు

నటుఁడు.

సదాశివరావు. పెండ్లికూతురు తండ్రి

సంజీవయ్య. పెండ్లికుమారుని తండ్రి.

సూర్యనారాయణరావు. పెండ్లికుమారుఁడు

సూరిశాస్త్రి } సంధానకర్తలు
అక్కభొట్లు }

పురోహితుఁడు:—

బుచ్చయ్య వంటబ్రాహ్మణుఁడు.

జనార్దనం న్యాయవాది.

న్యాయాధిపతి

ఇంకనుకొందరు సందర్భానుసారంబుగ వచ్చెదరు

## స్త్రీలు.

సుమతి - పెండ్లికూతురు

సుందరి - సంజీవయ్యభార్య

గుణవతి } అక్కచెల్లెండ్రు. సదాశివరావు కుమార్తెలు. పెండ్లికు
చతురమతి } మార్తెలు.



శ్రీరస్తు

శ్రీశారదాంబాయైనమః.

# వరవిక్రయము.

నాంది.

ఉ॥ శ్రీశుకభక్తవత్సలుఁడు ♦ సింధుగభీరుఁడు విష్ణుమూర్తి గౌ
రీశుఁడు శుభ్రదేహుఁడు ఫ ♦ ణీంద్రవిభూషుఁడు సాంబమూర్తి వా
ణీశుఁడు హంసవాహనుఁడ ♦ ధీశ్వరుఁడా గమ కోటికెల్లవి
ఘ్నేశుఁడు విఘ్ననాథుఁడు న ♦ భీష్టమొసంగుదురీ సభాళికిన్

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూత్ర—ఆహా? ఏమినాభాగ్యము? నేను బెట్టుసరి చేసిన కొలఁది వేల కువేలు పైగా కట్నమిచ్చెదము మాపిల్లను పెండ్లిచేసికొనుమని నాకుమారునికి సంబంధముపై సంబంధములు వచ్చుచున్నవి ఏసంబంధము నిశ్చయము చేయుదునాయని యోచించుచుంటిని ఐన నాఁడు వారికిగూడ నచ్చినసంబంధము చేయవలెనుగదా?

(తెరవంక చూచి)

నటీ ఒకసారి యిటురమ్మా.

నటి—(ప్రవేశించి) బావా ఎందుకు?

సూత్ర—నీ యిప్పరాక విన్నవించినదేమి?

నటి—(నవ్వుచు) అబ్బో? బావగారికి కోపము వచ్చినట్లున్నదే?

సూత్ర—కోపము రాదామరి.

నటి—ఎందువలన?

సూత్ర—సమయము వచ్చినపుడు పనికి రానందువలన!

నటి—మీకు సమయము లేనిదెప్పుడు సర్వకాల సర్వావస్థలయందు సమయము వచ్చుచునే యుండును!

సూత్రి—(చిరాకుతో) నీవనేదియు బాగున్నదికాదు. అవసరమైనప
నికి నీవువచ్చి యడ్డుపెట్టుచుంటివి.

గీ. ఆడువారలమనమున ♦ నరయకుండ
కార్యమొనరించె నేనియు ♦ గడకువాని
నీసడింతురు సుమ్ము మా ♦ మిట్టిబెట్టి.
కానకాంతలయోచన ♦ ల్గాంచదగును

నటి—(మోములు మూత్రిము బయటికి గంబరచి) ఏమండోయి! మీ
రునాదగ్గరకు రావలెను. కాని మీయాజ్ఞకు నేనుబద్ధురాలను కాను

సూత్రి—ఎందుచేత?

నటి—

చ. అరయఁగ వేయి రూప్యముల ♦ నాదటమీకు నొసంగియొంత యున్
బలిమితో మాచరించెగద ♦ పార్థివమొప్పగ నాదుతండ్రి ను
ష్కర విక్రయంబునను ♦ చాలినవాడటు గానమిమ్ముల౯
వరమతి నేలుకొందుగుణ ♦ భవ్యచరిత్రి కళావిశారదా!

(మోములో పికి తీసికొనును)

నటి—బావా! వింటివా? మాతొప్ప యిష్టానుసారంబుగ నడువవలయు
ను. (అనినిష్క్రమించును)

సూత్రి—మీసంగతిముందు జెప్పెదనులే? సభ్యులతో నొకవిన్నపము
జేసివచ్చెదను (దోసిలియొగ్గి) సభాస్తారులారా!

క. వరవిక్రయ మనునాటక
మరుదారక నాడ చూపి ♦ మదిరసయుక్తం
బురకవడి మోదా ♦ వహాముగు
స్థిరమతియాశీస్సులొసఁగి ♦ దీవింపుడొగి౯

(పుష్పములు సభికులపై జల్లి నిష్క్రమించును)

ఇది ప్రస్తావన.



శ్రీరస్తు

# వరవిక్రయము.



రంగము-సదాశివరావుగారి గృహము.

సదా—(ప్రవేశించి తనలో)

స్రగ్విణి॥ సుగుణాకర! కౌస్తుభశోభిత ప
క్ష! గదాధర! శ్రీశ! మురారి! హరీ!
నగధారి! సదా! నగవైరినుతా!
ఖగవాహనసంకలదాశ! విభో!

క॥ దేశదేశంబులెల్లను దిరిగితిరిగి
పాదములుబొబ్బలెక్కంగ బడలినాడ
కూతునకు బెండ్లిజేసెడు కోర్కెతోడ
నెట్లు సఫలము గాంతునో యెఱుగనైతి

ఆహా! కాలమహిమ ఏమని చెప్పవచ్చును? ప్రతివానికి గట్నములయందాశ జనించి దినదినప్రవర్థమానము కాఁజొచ్చినది. ఎవనినోటవిందు మన్న "కట్నమేమిచ్చెద" వనియడుగువారే. ఇంటిలో నాల్గు చిల్లిగవ్వలైన లేకున్నమానె. పిల్లవాఁ డింగ్లీషులో వ్రేలుపెట్టిన స్వంతమాత్రమున కట్నమని కలవరింతురు. ఆహా! ఈ దురాచారము మాన్పించుటకై యనేకోపన్యాసములిచ్చి సభ్యులచే మేల్మేలనుస్తుతి వాక్యములంది సంతోషంబున నా యభీష్టము నెరవేరెనని మిన్నందితిని కాని సమయమువచ్చునప్పటికి ప్రతివారును కట్నముమాటేమియని యడుగుచుండిరి. అక్కటా! లోకమా ఎంతదురాచారభూయిష్టమైపోతివి.

ఉ॥ భారతదేశమా! విమల ♦ భాసురకీర్తినివాసమా సదా
చారములెల్ల మంటబడె ♦ సన్నుతులెంతయుగాంచెగా దురా
చారమువహ్వారే! యింకను ♦ సాగునెనాదగుయెల్ల మెల్ల యీ
ఘోరముబాపగాగలనె ♦ కోవిదకోటిసెభాస సంగహా!

కన్యాశుల్కమెంత హీనమైనదో వరవిక్రయమంతకు దక్కువకాదు, దానినిశుల్కమరిని. దీనినికట్నమనెదరు. ఆలోచించిచూచిన చో రెండును సమానములే లోకమున లక్షాధికారియైన గావలె. భిక్షాధికారియైన గావలె. లేకున్న మధ్యస్థితియందుండు వానికి రోజులువెళ్లవు. ఈదినములలో నాకు పిల్లలకు వివాహములుచేయుట చాలకష్టతరము. నాకుమార్తెయగు గుణవతికి పెండ్లిచేయుటకై సంబంధములకొఱకు తిరిగి తిరిగి వేసారితిని. ఇంకనింటికిం బోవలయును శ్రమపడజాలను.

(అనినిష్క్రమించును)

(గుణవతి, చతురమతి. సుమతి ప్రవేశింతురు)

గుణ—అమ్మా! పదిరోజులై గ్రామాంతరమేగిన నాయనగారింకను వచ్చుటలేదు. ఎంతశ్రమ పడుచుండిరోగదా?

సు—అమ్మాయీ! ఏమనిచెప్పను. ఈకాలములో నాడుపిల్లలగనువారి బ్రదుకంత రోతయైనబ్రదుకు మఱియొకటిలేదు. ఏమనిన.

క॥ బాలా! యేమనిపల్కుదు.
శీలంబునుగల్గువాండు ♦ క్షితితలమునందున్
గాలించి వెదకిచూచిన
వాలాయము గాంచబోము ♦ వధువులకెందున్

గుణ—అమ్మా! నాయనగారు పడుకష్టముగాంచిన నెందులకు నాడుబిడ్డలమైజనించితిమా యని యోజించుచుంటిని.

సుమ—అమ్మాయీ! దానికివిూరేమి చేయుదురు. సర్వమును దైవాధీనముగదా?

చతు—దైవాధీనముగానున్న మనయిష్టమేమున్నది. అదిగో నాయన
గారు వచ్చుచున్నారు.

(సదాశివరావు ప్రవేశించును.)

సుమ—నాథా! ఇందువిశ్రమింపుఁడు.

సదా—(పడకకుర్చీపై గూర్చుని) అబ్బా! ఎంతశ్రమపడితిని.

సుమ—నాథా! (విసరుచు) శ్రమతీర్చుకొనుఁడు. కాయా! పండా?

సదా—పండైన శ్రమయనుకొననేల?

సుమ—ముఖము ముడుచుకొని నాయకా! దైవము పరులంగూడె.

సదా—తరుణీ! నేనేమని తెల్పుదును?

చ. కలిమిగలానికిం జనువు ♦ గాంచము విద్యయు గల్గెనేనియున్
లలనరో! శీలమిల్లపది ♦ లంబుగనయ్యది యున్నవంశమున్
దలఁపగఁ గోటు యద్దియును ♦ దాగొనన దుర్వ్యసనాభిలాషియా
దలప పరుంగనుంగొనఁగ ♦ ధారుణి శక్యమె దాతకేనియున్

సుమ—ప్రాణేశ్వరా! ఏకాలేజియందైన వరుడెవఁడు లేదా?

సదా—సుందరీ!

సీ॥ విశ్వవిద్యాలయంబుల ♦ విద్యగాంచు
బాలకావళిజూచితి ♦ పద్మనేత్రి!
యెట్లువారలయోగ్యులం ♦ చెంచవచ్చు
మనగుణవతికి దలబోసి ♦ గనిననెందు॥

ఉ. సీటును గొట్టఁజూపినది ♦ నెత్తినివెంట్రుక వింతగ్రాల సా
పాటు నొనర్చి విద్యచను ♦ వంగనులేక వయాళికేగుచున్
మాటికిమాటికిన్ దురభి ♦ మానముబూని చరించువారి న
ప్పాటమనంబుమెచ్చు గుణ ♦ వంతులటంచు దలంచికోమలీ

సుమ—ఇట్టి వెంగలికిచ్చుటకంటె నేనూతనో గోతనో బడద్రోచు
ట మేలుగదా? ఇఁక మనము చేయవలసినదేమున్నది.

సదా—ఎల్లవిధముల నాలోచించినను కట్నమీయనను పట్టుదలపాగు నట్లులేదు.

సుమ— „ఏయెండకాగొడుగుపట్టు" మన్నట్లిప్పటి కాలానుసారంబుగ గట్నమిచ్చి కుమార్తెకు పెండ్లిచేయక తప్పదు,

సదా—ఏమయినగానిమ్ము. కట్నమీయక యే వివాహము చేసెదను.

సుమ—నామాట వినుడు సంఘదురాచారంబు వారింప మన వశము కాదు. నలుగురేది మంచిగ నాలోచించిన నదియే యనసరణీయమైనది.

సదా—బోటీ! నామది నేమియు నిరమిద్దమని తోచుటలేదు. సూరి శాస్త్రి గారినీవిషయమై యోచించుటకై యొకపరి రమ్మంటిని.

సుమ—నాథా! భోజనమైనతరువాత నాలోచించుకొనవచ్చును. కావున స్నానమునకై రండు.

సదా—( లేచును - ఇద్దరును నిష్క్రమింతురు )

గుణ—చెల్లెలా! నాయనగారిపలుకులు వింటివా? ఏమేనిగానిమ్ము కట్నమిచ్చిచేసెకువరునిచే నేదాళిగట్టించుకొనను

మ. స్థిరమైదీర్ఘములై మనోహరములై ♦ దివ్యంబులై గాఢమై
కరమై సత్యము నైముదావహములై ♦ కాన్పిణ్యరాహిత్య సుం
దరమై కోమలమైలతాసమ మగుచా ♦ దాంపత్యమోదంబు దు
ష్కరశుల్కంబుల వాతనుంబడిననే ♦ చాయుం బ్రవృద్ధిం గనుచా

చతు—అక్కా! ఏమనిచెప్పవచ్చును. తల్లిదండ్రుల యిష్టమునకు వ్యతిరేకించగలమా? తండ్రిగారి యిష్టము మనకనుసరణీయము.

గుణ—చెల్లెలా! మనబాగుకొఱకు నాయనగారు తమజీవితము సుఖముగ జరుగు సుక్షేత్రంబుల నమ్మి తాను బీదనై యుల్లాడుట తలస్థించుచున్నది. కావున నొకసంగతి చెప్పెదను.

చతు—ఏమది.

గుణ—మనము జ్ఞానవంతురాండ్రము కదా?

చతు—ఔను.

గుణ—తల్లిదండ్రులు మనకు వందనీయులుగదా?

చతు—ఔను.

గుణ—వారుమననిమిత్తము బాధపడుచుంట చూచి సహింపఁగలమా?

చతు—సహింపలేము.

గుణ—కావున మన మవివాహితలమై యోగినీవ్రతంబున జీవయాత్ర
గడపుదము.

చతు—మంచియోచన చెప్పితివి. చాలబాగున్నది.

గుణ—నాప్రతిన వినుము.

చతు—ఏమది.

గుణ—

గీ॥ గుణముగల్గినివాఁడు ♦ కోవిదుండు
సంఘసంస్కారకమాన్యుండు ♦ సత్యముగను
తనకుదానైవరించి వ ♦ చ్చినగననగు
గాక యితరుబెండ్లాడనో ♦ కమలనయన
నీయభీష్టమేమి.

చతు—నిజముజెప్పెదను. క్రియాశీలవరుని బెండ్లియాడి వానిజక్కని
మార్గమ్మునబెట్టి లోకమున దురాచారఖండనము గావించెదను.

గుణ—నిజముగ నట్లుగావించెదవా?

చతు—తప్పకుండ అక్కా! ఎవరో వచ్చుచున్నారు. చూడుదము.

గీ॥ కర్ణకుండలధీధితుల్ ♦ గలయబర్వ
నొసలుకుంకుమ తిలకంపు ♦ పసజెలంగ
రమణనీర్కావిధోవతి ♦ బ్రిమద మొసఁగ
వచ్చువిప్రునిగాంచుమో ♦ వనితయిటకు

(సూరిశాస్త్రి ప్రవేశించును.)

సూరి—అమ్మాయీ! సదాశివరావు గారింటిలో నున్నారా?

చతు—అయ్యా! లోన భోజనము చేయుచున్నారు. తామిట విశ్రమింపుడు.

సూరి—(కూర్చుని) అమ్మాయీ! నీపేరేమి.

చతు—నన్ను "చతురమతి" యందురు.

సూరి—ఈమె.

చతు—మాఅక్క గుణవతి

సూరి—ఏమయిన జదివితిరా?

చతు—నేనాంధ్రంబున గొంచెము పరిశ్రమచేసితిని. ఆంగ్లేయంబునను గొంత పరిచయముకలదు.

సూరి—వీయక్కయో!

చతు—సంస్కృతాంధ్రాంగ్లేయంబుల బాగుగ జదివినది. హిందీయందు రాష్ట్రభాషాపరీక్షయందు త్తీర్ణురాలయినది.

సూరి—(తనలో) ఇంతచిన్నతనమునందెంత వరకు జదివినది? [ప్రకా] అమ్మాయీ! సిగ్గుపడెదవేమి? నేను పరాయివాఁడనుకాను.

గుణ—(నెమ్మదిగా) లేదండి.

సూరి—ఏది. అమ్మాయి! ఒకహిందీ పద్యము చదువుము.

గుణ— బడాకిఛోటా కుఛ్ కామ్ కీ జై
పరంతు పూర్వాపర్ సోచలీ జై
వినావి చారేయది కామ్ హోగా
కభీన అచ్ఛా పరిణామ హోగా

సూరి—బలే ఘనందుహువా. గుణవతీ! నీకు దగిన వరునిగూర్చిన చెప్పెదవా?

గుణ—ఆర్యా!

చ. సరసుఁడు సద్గుణాన్వితుఁడు ♦ సాధుచరిత్రుఁడు లోకమాన్యుఁడుం
స్థిరమతి బుద్ధిమంతుఁడును ♦ శ్రీపతి పాదయుగార్చనాత్ముఁడుం
దొరకిన మేలుగాని, తగ ♦ దుష్పథగామియు కుత్సితుండు నౌ
వరుని వివాహమాడ మది ♦ వాంఛ ఫలించునె భూసురోత్తమా!

శుల్కవిముఖుండగు వరునిగాని యువకుని పెండ్లియాడను.

సూరి—(తనలో) ఈకాలములో కట్నమీయకున్న మంచిసంబంధము దొరుకదా! (ప్రకా) అమ్మాయీ! యోగ్యవరాన్వేషణంబున శుల్కమీయక తప్పదు. ఐనను నాశక్తికొలఁది యోచించెదను

[సదాశివరావు ప్రవేశించి]

సదా—శాస్త్రిగారు ఎంతసేపయి వచ్చితిరి.

సూరి—ఎంతోకాలేదు. అరగంటయైనది భోజనము చేసితిరా?

సదా—ఏమిభోజనమండీ! తిన్నతిండి నీరైపోవుచున్నది. సరిగ యొంట బట్టుట లేదు.

సూరి—కార్యము నెత్తిమీఁద నున్నప్పుడు తిండితిప్పలు తోఁచవు

సదా—మీఅమ్మ కనిపెట్టుకొని యున్నది. మీరు వెళ్ళి మీయమ్మను బాపుడు.

గుణచతుర—మంచిది. (నిష్క్రమించును)

సదా—శాస్త్రిగారూ! మంచిసంబంధమేదేని యోచించిచెప్పుఁడు

(సుమతి ప్రవేశించుచున్నది.)

సూరి—కావలసినన్ని సంబంధములున్నవి.

సదా—బోటీ! శాస్త్రిగారుమనకు జాల కావలసినవారుసుమీ సాధారణముగ వారెఱుఁగని సంబంధము లీమండలంబున లేవు.

సుమ—అటులనా?

సూరి—అమ్మా! నన్నుమీరు బాగుగా నెఱుగరు కాని ఎవరికిసంబంధముల విషయమై యోచన కావలసివచ్చినను నన్ను పురస్కరించుకొని యోచింతురు.

సదా—మనకనుకూలమైనవి యోచించిచెప్పుడు.

సూరి—విస్సాప్రగడ నరసరాజుగారి కుమారుఁడు సాలునకు రెండువేలువచ్చును.

సుమ—చదువు.

సూరి—సామాన్యము

సుమ—మఱియొకటి సెలవీయుఁడు.

సూరి—కూచిమంచి శంకరయ్యగారికి-సాలునకు నాలుగువేలు పైగా వచ్చును పిల్లవాఁడు స్కూలుఫైనలు ప్యాసయినాడు.

సుమ—ఈపిల్లవాఁడెన్నవయతఁడు?

సూరి—ఇతఁడైదవవాఁడు

సుమ—ఇంకను దమ్ములుకలరా?

సూరి—ముగ్గురున్నారు.

సదా—అష్టపుత్రబహుధనమస్తు అనునార్యోక్తి సీతనియందు వర్తించినది

సూరి—పోనిండు. సత్యవోలు సోమసుందరంగారి కుమారుడు పట్టపరీక్షయందు త్తీర్ణుఁడైనాఁడు. సుందరవిగ్రహుఁడు

సదా—వసతి!

సూరి—సాలునకు పది వందలు వచ్చును.

సుమ—ఎందరన్నదమ్ములు?

సూరి—ముగ్గురు-ఇతఁడు రెండవవాఁడు

సదా—కట్నమెంతీయవలెను?

సూరి—వేయునూటపదారులు కట్నము. వెండిచెంబులు పట్టుతాపితాలు వియ్యపురాలు లాంఛనములు. ఇంకను పైవచ్చుబడులు.

సదా—అబ్బా! మఱియొకటి చెప్పుఁడు?

సూరి—వకల్లంక సంజీవయ్యగారి దత్తకుమారుఁడు సంవత్సరమునకు పదిహేనువందలు వచ్చును ఏబదివేలకుపైగా లక్షకులోపు సగమునిల్వ పిల్లవాఁడు బుద్ధిమంతుఁడు. సుందరుఁడు.

సదా—ఈసంబంధము యోచింపుఁడు

సుమ—కట్నము మాట!

సూరి—వేయినూటపదారులకు తక్కువపడను. ఐన నాలోచింతము

సదా—మీరు కినుకొక్కని యుదిస్థిరపరుమఁడు. మీమేలు మరచిపోను.

కౌండి

సూరి—ఎంతమాట సెలవిచ్చితిరి నేను మీకు పరాయివాఁడనా?

సదా—మాకు పరాయిలయిన మీతో యోచించుట యెందుకు?

సూరి—(తనలో) ఇక్కడ శతమానమునకు దక్కువపడదు. సంజీవయ్యగారిదగ్గర యింతకంటె కొంచెమెక్కువగా పుచ్చుకొనవచ్చును. (ప్రకాశముగా) ఇతకు వారియభిప్రాయము కనుగొనినతరువాతఁ గదా?

సదా—ఏలాగునైన జక్కచేసికొనిరండు.

సూరి—తొందరపడిన కార్యమగునా? "చలమేలకార్యవాదికి" అను నార్యోక్తి ననుసరించి చేయవలెను, అయ్యా! నాకు సెలవీయుఁడు నాయంత్రము తిరిగిమీదర్శనము చేసెదను.

సదా—దయయుంచుఁడు. మీరాక కెదురుచూచుచుందును.

సూరి—చిత్తము

సదా—

చ॥ చెలిమిగణింపుమయ్య కను • శీఘ్రముకార్యము సానుకూల్యమున్
జూపి వధూవరుల్ మిగుల • సంతసమందగ జేయుమయ్య మీ
వలనను నాకు శ్రేయములు • వారక వచ్చుగదయ్య మిమ్ములన్
దలపను పూటలేదుగద • తథ్యము భూసురవంశభాసురా!

(అందరు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము



శ్రీరస్తు

# వరవిక్రయము.

## ద్వితీయాంకము



రంగము—సంజీవయ్యగారి గృహము.

సంజీ—(ప్రవేశించి)

క॥ ధనమే జనులకు ప్రాణము
ధనమే సద్గతికి తెరవు ♦ ధనమే సఖుఁడున్
ధనమే దాతల చుట్టము
ధనమే లోకాశ్రయంబు ♦ ధనమే యశమున్

ఆహా? ధనమునందెంత ప్రభావమున్నది? పదియవతారము లెత్తి నానా శ్రమలపడిన విష్ణుమూర్తి లక్ష్మి యొక్కడకుఁబోవునో యనుభయంబున తనవక్షస్థలంబున దాల్చియున్నాఁడు అతని కుమారుఁడు తనగర్భమునందే బొక్కసముంచుకొని తస్కరభయంబున నాల్గుముఖంబుల నలుదిక్కులు చూచుచున్నాఁడు. వెండికొండ నివాసముగాఁగల శివుఁడుమాత్రము సామాన్యుఁడా. భిక్షుకునివలె పునకదాల్చి చరింపుచున్నాఁడు వీరందరు ధనమెక్కడకుఁబోవునో యనుభయంబుననేకదా? యిట్లు సేయుట ఇఁక నాబోటి వానిమాట లెక్కయేమిటి? లోకమున ఖ్యాతిగాని, యపఖ్యాతిగాని మనుజుని నడతనుబట్టి వచ్చును. కొందఱు నన్ను లోభియని యనుకొందురు. అంతమాత్రమున నాగౌరవమున కేమి

తక్కువ. ధనము సమస్తసుఖములకు మూలము. ధనము ప్రతి
పనికి నావశ్యకమైనది. ధనసంపాదనకై పెక్కుకష్టములు పడవ
లయును.

సీ॥ గోపుర ప్రాకార ♦ కూప సత్రంబుల
కట్టించుమని వచ్చు ♦ గర్వమతుల
యజ్ఞయాగాదు ల ♦ న్వ్యయమునకై కోరి
యరుగుదెంచిన సోమ ♦ యాజిజనుల
నంగవిహీనుల ♦ మంచును భిక్షంబు
యాచించి వచ్చెడు ♦ నర్థిజనుల
విద్యార్థులనుటంచు వివిధ రీతులవచ్చు
నా బోటుకగు బ్రహ్మ ♦ చారితతుల
గ వంకిలను బెట్టి ద్రవ్యంపు ♦ ప్రియముమాన్పి
కేలియొనరించి వెనువెంట ♦ నోవిదిప్పి
కఠిన దండఘాతంబుల ♦ గడకు ద్రోచి
వారిమీాయుక వారించి ♦ పంపవలయు.

ధనమున్నవానికడకు బంధుగులమంచు, హితులమంచు, పెండ్లి
చేసికొందుమనియు, మహారాజువనియు, నింద్రుఁడవనియు జం
ద్రుఁడవనియుఁ బెక్కుగు పెక్కునెపంబులవచ్చి ధనము గుంజి
కొననెంతురు. అడిగినవారికెల్ల ధనమునిచ్చిన నిలుచునా? కొం
డంత ధనరాశి నొక్కలిప్తలో ఖర్చు చేయవచ్చునుగాని కూ
ర్చుట కష్టముకదా? ధనవంతుఁడు యశోవంతుఁడు. ధనవంతుఁ
డు గౌరవంతుఁడు. ధనికుడే యున్నతోద్యోగము చేయనర్హుడు
"సర్వేజనాః కాంచనమాశ్రయంతి" యనుమాట ఎందునకు
బుట్టినది. ధనము నతిజాగరూకతతో గాపాడవలయును. ధన

మే ప్రాణము. ప్రాణముపోయిన పోవునుగాని ధనముమాత్ర
ము విడువరాదు. ప్రతిక్షణము విలువగలది. వడ్డికి వడ్డి గుఱ్ఱము
లాటవు. అసలు కుమారునివంటిది. వడ్డి మనుమనివంటిది. అం
దుచేతనే "అసలుకంటె వడ్డిముద్దు" అనిరి. చీపురుపుల్లపోయిన
తిరిగిరాదు- కడకు పశువులపేడ లగాయతు ప్రతివిషయము
స్వయముగా జూడకున్న నపహరింతురు- ప్రతివిషయమునందు
జాగ్రత్త మంచిదికదా? నోట్లు దస్తావేజులు ప్రతిదినము కాల
దోషములు పట్టకుండ జూడవలెను-

(వంటబ్రాహ్మణుడు బుచ్చెయ్య ప్రవేశించును)

బు—పంతులుగారు! వంటకు సామానిప్పించనా!

సం—అప్పుడే వేళయైనదా? (తనలో) ఇప్పటివరకు నీళ్లకావిళ్లు మో
సిమోసి వచ్చితివికదా? ఏదో యింతతెగలేసి లేచిపోయి జూద
ములో ప్రవేశింతువుగాంబోలు, (ప్రకా) ఈపూట కేమివండె
దవు?

బు—అమ్మగారు వంకాయకూర, పప్పు, గొబ్బరికాయపచ్చడి, చారు
చెయ్యమన్నారు-

సం—(తనలో) ఒకపూటలోనే కాపుర మునగంటిపోవదా? ఈలాగు
నైతే తుదనెగ్గిందిఅన్నమాటే- (ప్రకా) ఎప్పుడు చెప్పినారు?
నాసెలవులేనిది అమ్మగారితో మాటాడవద్దని ఎన్నిసారులు చె
ప్పవలెన?

బు—మాటాడితే తప్పేమిటండి మీకోలుగోసున్నప్పుడు మీవారితో
మాటాడవలయునుకదా?

సం—అదిగో ఆమాటే-జీతభత్యములిచ్చు నామాటవినకపోతే బాగా
జరుగదుసుమా

బు—మీతోటి లావాదేవీలు పడలేను, మృత్యుంజయరావుగారింట

నెలకు పాతికరూపాయలిచ్చి యున్న వస్త్రము లిస్తామంటున్నారు
సిస్తారము పనికూడ లేదు పెండలకడనే భోజనము లయిపోతవి
ఇంకను పదుపాయము లనేకములున్నవి. మొన్నకనబడి ఎవరి
నైనా చూడమని చెప్పినాను. నాకు సెలవియ్యండి

సం—(తనలో) దొంగముండకొడక! కోడలుదగ్గఱకొని, యత్తదగ్గ
అమ్ముతావు. యజమానుని దూషించి పరాయివానిని పొగడు
చుంటివి. వీనిని వదలితే యిప్పుడు పదిరూపాయిలకు గుమస్తా
దొరకునుగాని ఇరువదిరూపాయలకు వంటబ్రాహ్మణుడుమాత్రం
దొరకుటలేదు. పోనీ వంటబ్రాహ్మణుని మాన్పించుదమ
న్న, ఇంటిఅవిడ నీళ్ళువల్లకాదు తెచ్చుటకు వీధిలోనికి వెళ్లినం
తలో నెదగిత్తలవలె సకిలింతలు, కోరచూపులు గుసగుసలు కం
డ్లమిటకరింపులు, కూనుదీర్ఘములు, దిబ్బ, దిరిగుండము, యావ
న్ని బయలు దేరును, యవ్వనవతి వీధిలోనికి బోవీలులేదుగదా?
అందునను నాభార్య చిన్నదియు నేను ముసలివాడనగుటచే
నన్నుజూచిన నెప్పుడు కొరకొరలాడుచుండును [ప్రకాశముగా]
నాకుమాత్రము వంటబ్రాహ్మణుడు దొరకడా? నీవు చాలకా
లమునుండి కనిపెట్టుకొని యున్నావుగదాయని నీపొగరుమోతు
తనమును సహించుచుంటిని.

బు—మీరు సహించనక్కరలేదు (అని వెళ్లబోవును)

సం—బుచ్చెయ్యా? ఎందుకింతకోపము బుద్ధిమంతుడ నే? పోయిరాజ
వేసినావా లేదా? బియ్యం మెన్నికావలెను చెప్పుము

బు—మీయిష్టమువచ్చినన్ని యివ్వండి ఒకరోజున్నైన కడుపునిండు
చున్నదా?

సం—(తనలో) వీనిని ఆట్టె వాగించగాదు. (ప్రకాశముగా) ముప్పా

వుశేరుబియ్యము, మూడుమిరపకాయలు, గిద్దెడు పెసరపప్పు, రెండువంకాయలు, మూడుతులములచింతపండు. 3 తులముల యుప్పు, నూనె రెండుతులాలు, నెయ్యి తులము నాల్గువిస్తళ్ళు యుంకేమికావలెను?

బు—వీనితో నెట్లు వండి తగలబడుట? ఎవరికి సరిపోవును.

సం—బుచ్చెయ్యా! మనము నలుగురమేకదా? నాతిండి చెప్పనక్కఱ. లేదు గదా? అబ్బాయి అబ్బాయియే. అమ్మగారుమాత్రమే మితినును? సరిపోవునులే?

బు—ఇక నాకొక్కనికేగదా యిదంతయు పుల్లలుమాట చెప్పండి కొబ్బరికాయమాట?

సం—అబ్బో? కొబ్బరికాయయా? వద్దు ఆవకాయను తీయుము. బోలెడు పెట్టించితిని నిల్వయుంటే పాడైపోతుంది. కారమూట్టే వేయుట తెలిసిందా?

బు—బాగా తెలిసింద (అనినిష్క్రమించును)

సం—సంసారము బోసిపులిగదా? (విశ్వనాథం ప్రవేశించుచున్నాడు)

వి—దండాలండి (అనినమస్కరించును)

సం—రావోయి విశ్వనాథం! కూర్చో, పనిమీదవచ్చినావే?

వి—మొన్నటి చేబదులు తాలూకు యిప్పిస్తారా?

సం—(తనలో) పిశాచములాగు వచ్చినాడు. ఏదో వంకబెట్టి డబ్బియక పంపించవలెను (ప్రకాశముగా) దస్తు హాజరులేదు రేపు తప్పకుండా పంపిస్తాను.

వి—సొమ్ము చాలఅవసరముగానున్నది. ప్రభువులు మీరే యీలాగు నచేస్తే యేమనిచెప్పను.

సం—తొందరపడకు ఏదోచూచి యిస్తాను.

వి—సెలవుదయచేయించండి (అని నిష్క్రమించును)

సం—ఇప్పటికి నీపీడ వదలినది.

(సూరిశాస్త్రి ప్రవేశించును)

సూరి—(తనలో) ఏదోవ్యవహారము మాటాడి తర్వాత కార్యములోనికి దింపవలెను. (ప్రకాశముగా) సంజీవయ్యగారు ఏమిచేయుచున్నారు.

సం—ఏమున్నది. శాస్త్రీ! మీరు వచ్చినపనియేమిటి?

సూ—ఒకఆసామీకి తనఖామీద పదివేలు బదులుకావలెను.

సం—అంతసొమ్ము కావలెనా? పల్లమా? మెరకా? యీనామా? జిరాయితీయా? యిప్పటివరకు తనఖాలేమియు లేవుగదా?

సూరి—స్వక్షేత్రఖండిక- ఈనాము. మీతనఖాసొమ్ముకు పదిరెట్లు విలువగలది వడ్డీసంగతి చెప్పండి.

సం—ఇప్పట్లో బదుళ్ళు కావలసినవార లెక్కువగానున్నారు. రూపాయి తొమ్మిదణాలకు తక్కువపడదు. అందులో మీమామూలు తప్పదుగదా?

సూ—నామామూలుమాటకేమిగాని నూటికి పదిరూపాయలవంతున వడ్డి యేర్పాటుచేయించండి, పెద్దమొత్తము.

సం—నేనైనా యెక్కడనైన తేవలెనుగదా? అంతమొత్తము నిల్వయుండునా?

సూ—నామాటప్రకారం వప్పుకొనండి బహుశా తీర్పలేరు- మీకే క్రియపరుచుదుగు.

సం—రికార్డు తెప్పించుడురు, చూస్తాను.

సూ—(లేచి) నాకు సెలవు దయచేయించండి. (పరిక్రమించుచు) యీసంవత్సరము అబ్బాయికి వివాహముచేసెదరా?

సం—అనుకూలమైన సంబంధమువస్తే ఆలాగుననే చేయచ్చును.

సూ—మీదాహముమాట చెప్పదురు?

సం—వీలుననుసరించి. సంబంధ మెక్కడిది?

సూ—మీ రెరుగరా? ఎఱ్ఱాప్రగడ సదాశివరావుగారి పెద్దకుమార్తె పదకొండువత్సరములు దాటినవి– చక్కనిచుక్క.

సం—చక్కదన మెవ్వరికిగావలెను. కాని సదాశివరావుగారికి స్థితి యేపాటి?

సూ—పాలునకు పండ్రెండువందలు వచ్చును. మాతామహుఁడు పిల్లలకు వేయిరూప్యములువచ్చు మాన్యము వ్రాసియిచ్చినాఁడు.

సం—కట్నమీయక వివాహము చేయు సంఘసంస్కారులే సదాశివరావుగారు.

సూ—ఆసంగతి నాలోచించెదను. నాకమీషనుసంగతి?

సం—కట్నముమాట పైసలుచేస్తూ. నీకమీషనుకేమి?

సూ—వేయిరూప్యములు–పైన నూటపదార్లు.

సం—(పెదవి విరచి) ఇంతేనా? యిందులో నీకు కమీషనా?

సూ—ఎంతకట్న మిప్పించవలెను?

సం—వేలపయిన యోచిస్తే కమీషనుమాట చెపుతాను

సూ—నూటికి పదులయితే చెప్పండి.

సం—యోచిస్తూ వెండిచెంబులు, కంచం, పట్టుతాపితాలు, వాచీగొలుసు, చేతిగొలుసు, అలకపాన్పుపైన సయికిలు, వియ్యపురాలాంఛనము, అయిదువందలు, ప్రతిరోజుచీరచొప్పున అయిదు చీరలు, బొట్టుపెట్టె, పసుపుపళ్లెములు, నూనెగిన్నె, బంగారపు పలుదోముపుడకలు, వెండినీళ్లచెంబు, సబ్బుబిళ్ల వుంచుకొనే వెండిడబ్బి, బొట్టుకు అయిదుకాసులు.

సూ—ఈవివాహముతో వారిసంసారము కూలిపోయి ముష్టిచెంబు చేతికి రావలసినదే?

సం—చూడు! నలుగురిలో వారికేగొప్ప. ఇందులోనావడిలో ఏమిప
దుతుంది. ముద్దుముద్దుగా అల్లుడుకుచెట్టితే మామామగారిచ్చి
నారని షోకుగా వయ్యారంగా నలుగురిలోను వారిఅల్లుడే తిరు
గునుగాని నాకేమి?

సూ—మీరు మొదటనే యీలాంటి గొంతెమ్మకోరికలు కోరకండి. అ
న్నీ నేను చక్క పెట్టుతాను.

సం—సయిష్టము. ఏవ్యవహారములలో నీకు తక్కువచేసినాను వెళ్లి అ
న్నియు సరిచేసి వారిని తీసుకొనివస్తా?

సూ—సాయంత్రికివస్తాన్నాము (అని చెవిలో నేదియోచెప్పి నిష్క్రి
మించును)

సం—ముదుసలికి పడుచుభార్య ప్రాణసంకటముగదా? అందుచేతనే
సుమతీశతకములో "ముప్పునబ్రాయంపుటాలు" అని చక్కని
నీతిని బోధించినాఁడు.

చ. మురిపెముజూపినన్ మనసు ♦ ముచ్చటదీరగ మాటలాడ దా
తరుణి సమీపవర్తియయి ♦ దార్పదుశయ్యకు మేను యింత
స్థిరముగ నాముచేతలకు ♦ చేతము సమ్మతిబొందదెంత వేమరు
బ్రతిమాలినన్ కృధను ♦ మానదు మానసమందు నుంతయున్

అదిగో నాభార్యయగు సుందరి వచ్చుచున్నది.

(సుందరి ప్రవేశించి)

సుం—ప్రొద్దుటనుండి పనులతొందర తీరనేలేదుకాఁబోలు, తిండితిప్ప
లు ఏమీ అక్కరలేదు?

సం—తొందరపడకు శాంతించు.

సుం—శాంతింపకేమున్నది. కావలసినవన్నిమైన తర్వాతశాంతము పర
మశాంతము, ఏది బనారసుచీర. మొన్ననే తెచ్చిగిమన్నారే?

సం—ఇదిగో (అని ముసిముసినవ్వులు నవ్వుచు) అయిదుచీరలు

సుం—ఉట్టికెక్క లేనమ్మ స్వర్గాని కెక్కినదన్నట్లు,, ఒకటిలేదు.

సం—నేను కొంటున్నా ననుకున్నావా యేమిటి?

సుం—ఇంకెక్కడనుండి వచ్చుచున్నవి?

సం—రేపు అబ్బాయికి పెండ్లిలో వియ్యాలవారు పెట్టుదురు.

సుం—(మూతివిరచి) ఇంతమాత్రపు సంబరమునకేనా యీపొంగు. అదిక్కుమాలినవాళ్ళు మీకునన్ను గట్టిపెట్టి నాగొంతుక కోసినారు. ముచ్చటకైన శుభ్రమైన కోకగట్టుకొన్న పాపమున బోలేముగదా? యింతఉన్నదన్నందుకు తానుతినవలె నితరులకు బెట్టవలె. ఎందుకీడబ్బు? మీతోటికూడ వస్తుందికాబోలునా?

సం—శుభముపలకరా మంకెన్న? అంటే ఏదోఅన్నాడట నీతో అబ్బాయి పెండ్లిముచ్చటలు చెప్పుచుంటే సాంపరాయికము మాటలు చెప్పుచున్నావు. చాలు, మంచిదానవే,

సుం—ముసలిముప్పన పాతరోగమన్నట్లు,, మీసరసము బాగున్నది. ఒక్కచీరకు నోచుకోలేదుగదా? యీదిక్కుమాలిన కాపురము నేను చేయలేను. నాపుట్టింటికిఁబోనింగు [అని వెళ్లబోవును]

సం—(బ్రతిమాలుచు) నీయిష్టమువచ్చినట్లు నడుస్తాను- నామాట విను- తొందరపడకు- వారీసాయంత్రమువచ్చి సంబంధము స్థిరపరుస్తారు. అప్పుడు నీకు లాంఛనములన్నీ జాగ్రత్తగా ఫయిసలు చేయిస్తాను. ఐదువందలకు తక్కువయుండదు. నీయిష్టము వచ్చినట్లు చేసికో. ఇందులో నాకేమీ అక్కఱలేదు.

సుం—డబ్బుమాత్రము కంట పడనీయరు. మాటమాత్రము చెప్తారు.

సం—ఓసివెఱ్ఱిదానా! ఏవో నాల్గుడబ్బులు చేతిలోనుంటేకాని నలుగురు గౌరవించరు. (సగర్వముగా) వక్కలంక సంజీవయ్యగారి భార్యఅంటే పదిమందిలో నీకుగౌరవమొందుకువస్తోంది. ఎందు

చేతనో తెలియునా?

సుం—ఆపిస్సినిగొట్టుముసలి-తాతగారిభార్య అనికూడ అందురు.

సం—(పండ్లు కొరుకుచు) మిడికేవు, వెఱ్ఱిజెట్టా. నీకు మంచిచెడ్డ ఏమీ తెలియదు. ఈప్రసంగము చాలించు. అదిగో అక్కభొట్లు వస్తున్నాడు. లోపలకు వెళ్ళు.

సుం—రానివ్వండి నాకేమిభయము (అని నిష్క్రమించును)

(అక్కభొట్లు ప్రవేశించి)

అక్క—సంజీవయ్యగారు! క్షేమమా!

సం—ఆహా! ఇక్కడ కూర్చుండుము. నీతో సూరిశాస్త్రి మాటాడినాడా?

అక్క—మాటాడినాను. వారు రానియ్యండి నాతమాషా కనపరుస్తాను

సం—సదస్యమునకు నీవద్దు మరచిపోనులే- ఉపకారమునకు ప్రత్యుపకారముండవలెనుగదా?

అక్క—మీదయ, మహారాజులు. అదిగో వారు వస్తున్నారు. మన ప్రసంగము ప్రారంభింపవలెను.

సం—అబ్బా! నన్నువిసిగించకండి సూరిశాస్త్రిగారికిమాటయిచ్చినాను

(సూరిశాస్త్రి, సదాశివరావు ప్రవేశింతురు.)

అక్క—నామనవి చిత్తగించండి. ఎంతో తేడాలేదు. పిల్లచాల అందమైనది.

సం—చక్కదనము కొరుక్కొని తింటామా.?

సూ—(సదాశివరావుగారితో) మనకేలినాటిశని దాపరించినది. వీడేదియో సంబంధము మాట్లాడుచున్నాడు.

సదా—ఎక్కడకు వెళ్ళినా దౌర్భాగ్య దేవతముందు నడచుచున్నది.

సూరి—తొందరపడకండి.

సం—(లేచి) బావగారు దయచెయ్యండి.

[అందఱు కూర్చుందురు]

సూరి—అక్కుభొట్లు. ఎప్పుడు వచ్చితివోయి

అక్కు—ఇప్పుడే, మీకంటె నాలుగడుగులుముందు.

సూరి—సంజీవయ్యగారు, మాకు మాటయిచ్చి తిరిగి యీమాట లేమిటి?

సం—నేను ఆలాగేఅంటున్నాను. ఏమిచెయ్యను. సంబంధముల కంతులేదుగదా?

అక్కు—నామనవివినండి. వెయ్యిన్నూటపదాఱులు కట్నము వియ్యపురాలు లాంచనము అందులోసగము

సూరి—[సదాశివరావుగారితో] చూచితిరా? వీనిదురాగతము. ఇప్పుడేమిచేయవలసినది. ఎంతకైన తీసిపోగూడదు [సంజీవయ్యగారితో] అయితే పదిహేనువందలు. సదాశివరావుగారు కట్నమిచ్చెదరు. వీరిసంబంధ మంగీకరింపుడు,

అక్కు—అలారండి. ఎవరెక్కువ కట్నముపాడుదురో వారిపిల్లను స్థిరపరుస్తారు, మాపాట రెండువేలు

సూరి—[సదాశివరావుగారితో] ఎమంటారు. ఇంక రెండువందలు పెట్టిచూస్తాను, [సంజీవయ్యగారితో] ఇరవైరెండువందలు.

అక్కు—మాపాట ఇరవైయైదువందలు,

సూరి—నీకంటెనేను తక్కువవాడనా? మూడువేలు ఇంకనోరు మెదుపుచూస్తాను.

అక్కు—మూడువేల యేదువందలు. రామజీ, నీబింకము.

సూరి—నాలుగువేలు ఏమనుకున్నావు.

అక్కు—పైన రెండువందలు

సూరి—నీవాచాలత్వము చాలించు. నలభయి రెండు వందలిప్పింతువే ఈలాగు స్థిరపడిన సంబంధమున కడ్డముతగులుట శ్రేయము కాదు.

అక్క—నేనేమి చెయ్యను, వారియుత్తరవు ప్రకారము నేను నడుస్తాను,

సూరి—అయ్యా! నలభయి యైదువందలు, మీకిష్టమా, [సదాసివరావుగారితో] అయ్యా! మనవి, (అని లేచును)

సదా—(లేచి పరిక్రమించును) ఏమియాలోచన,

సూరి—ఏమున్నది ఏమయిన సరేమీరు వెనుదీయకండి, ఐదువేలు వరకు మన మానుకొందము, పైమాట చూడవచ్చును.

సదా—సరే కానియ్యండి, (ఇరువురువచ్చి కూర్చుందురు.)

అక్క—నలభయి ఎనిమిది వందలు,

సూరి—ఐదువేలు కట్నము సదాశివరావుగారిచ్చెదరు, నామనవి యంగీకరింపుడు,

అక్క—ఇంక మాకిష్టములేదు, మీయిష్టానుసారముజరిగించుకొనుడు

సూరి—సదాశివరావుగారు' ఏమయిన అడ్వాన్సుయిచ్చి రశీదు పుచ్చుకొనుడు. పైన నెనరైనావస్తే మాట తిరుగుగగలరు,

సదా—ఇదిగో నూరురూపాయిల నోటు (అని సంజీవయ్యగారి కిచ్చును.)

సం—(పుచ్చుకొనుచు) వియ్యపురాలు లాంచనములు, అలకపాన్పుపై మామూళ్ళుగా కనుమండీ బావగారు, మళ్ళీమళ్ళీ మనలోమనము పేచీలుపడడం ధర్మంకాదు, సొమ్మంతా వివాహమునకు పదిహేనురోజులు ముందుగామాకు చేరవలెను.

సదా—సరేనండి మీసెలవుప్రకారం నడుస్తాము కాని మఱియొకలాగున జరుగదు. మాకు సెలవియ్యండి. శాస్త్రిగారు సెలవుతీసికొండి.

సం——బావగారూ!

గీ॥ వెంటనె ధనంబుబంపుడీ ♦ వేయు నేల
మించుబాంధవ్యముంచి వ ♦ ర్తించుమనము
మనములందున పొల్గొవి ♦ మాటలాడ
కూరకుండిన కార్యంబు ♦ లొప్పవుకద

సహా——మంచిది

ఇది ద్వితీయాంకము





శ్రీరస్తు

# వరవిక్రయము.



## తృతీయాంకము.

రంగము—సదాశివరావుగారి యిల్లు

(సదాశివరావు సుమతి, చతురమతి, గుణవతి ప్రవేశింతురు.)

సదా—బోటీ! ఆడుబిడ్డలగను సంసారిజన్మము చింతాకరమైనదిసుమీ?

ఉ. కోరికబిడ్డలంగనిన ♦ గొప్పగబెంపఁగ నొక్కచింత వి
స్తారధనంబొసంగినను ♦ జక్కనిభర్తను గూర్పజింత యు
దారలపేరిముడింగురిచి ♦ స్వాంతమునందొక వింతజింత సం
సారికి లోకమందు సుఖ ♦ సౌఖ్యములున్నవె యెంచిచూడగన్

సుమ—నాథా! ఔను. మీరువెళ్లిన పనేమయినది.

సదా—తరుణీ!

ఉ. అవ్వనకేగినన్ మొదట ♦ యాస్తియొకింత ఋణంబుకంటె మే
ల్గొప్పగనుండగావలయు ♦ గోరినవడ్డియొసంగ గావలెన్
తప్పగ నూటికైదులు గ ♦ దార్పదికీవలె యద్దుగూటలన్
జెప్పక పత్రిముక్కటను ♦ జెచ్చెరవ్రాయవలెన్ ఫలాప్తికై

ఇన్నివిధంబుల సమకూడినను కార్యము సానుకూలపడుట చాలకష్టము.
చూచితివా కట్నమే యెమువేలు. పైనలాంఛనములు రెండువే
లవరకుండును, భోజనపువ్రయములు మిగిలినవి. ఇవన్నియుజూ
చిన బదులు తెచ్చుటకంటె గొంతభూమి విక్రయించుటమేలు.

గుణ—నాయనా! నామనవి యాలకింపుడు,

సదా—ఏమిటమ్మా? నీకోరిక.

గుణ—

వృత్తము జననీ! జనకా! ♦ చనునేయిటులన్
ఘనమాన్యము వి ♦ క్రయముం జలుపన్
ఘనులౌదురు సం ♦ స్కరణంబున మీ
రనగా వినమే ♦ యశముంగొనరే

సీ॥ సంస్కర్తసంఘంబు ♦ సన్నుతుల్ సేయంగ
సంచితంబగుపేరు ♦ లందినావు,
వరవిక్రయాచార ♦ వ్యాధులమాన్పంగ
ధన్వంతరియనంగ ♦ దనరినావు
ఆంగ్లేయవిద్యల ♦ నాత్మజాతలకిచ్చి
మార్గదర్శివనంగ ♦ మసలినావు
తులలేనిబిరుదుల ♦ దిలకించి హాసించి
నిర్వికారంబున ♦ నెగడినావు

గీ॥ తనయునకు బెండ్లిసేయంగ ♦ దలంచినేడు
కట్నమీయంగ నెంచితీ ♦ కడదియహాహా
వలదు మాన్యవిక్రయమును ♦ వలదుపెండ్లి
మానుడీ యత్నమేటికి ♦ మాన్యచరిత!

సదా—అమ్మాయీ! ఏయెండకాగొడుగు పట్టుడన్నసంగతినీ వెఱుంగవు

సుమ—వెఱ్ఱిదానా! పిల్లకాకి కేమి తెలియునుగా యుండలదెబ్బ అన్నట్లునీకు లోకజ్ఞానము తెలియదు గనుక యిట్లు పలుకుచున్నావు. వివాహమునకుముందు రజస్వలయైన కులమున తెలియాదుము పూర్వాచారమును సరణీయముకదా?

గుణ—అమ్మా! పూర్వాచారము పూర్వాచారమని కలవరించుచుం

టివి నేనుత్రికరణశుద్ధిగ జెప్పుచుంటిని. కట్నమిచ్చినవరుని నేను బెండ్లియాడను.

సదా—అమ్మాయీ! చిన్నదానవు. నీకీపట్టుదలకూడదు. నేను పట్టుదల గలవాఁడనేకనా? ఎందుకీరీతి నొడంబడుచుంటిని. కాలమున ననుసరించియేకదా?

గుణ—నాయంతరాత్మ కట్నమిచ్చి తెచ్చిన మగనియందనాదర మూరుచున్నది.

సదా—అమ్మాయీ నామాటవినుము పాలు నీరు గలసినవిధంబున నీవు నీమగడు సంతోషంబున దిరుగుచున్న మాకదియే పదివేలు. మాస్థితినిగురించి యోజింపకుము.

గుణ—తండ్రీ! మీరుచెప్పినది సమంజసముగాలేదు. వధూవరులకన్యోన్యప్రేమంబంతఃకరణంబున నుద్భవించి యభివృద్ధి నొందవలసినదే ధనదానంబునగాదు.

సదా—అమ్మా! ఒకచెంపఁగొట్టిన పాలు నొకచెంపఁగొట్టిన నీరుగారు నీవీవిషయమున కలుఁగజేసికొనకుము.

గుణ—నాయనా! నాయభీష్టమునకు వ్యతిరేకింపఁజాలను.

(సూరిశాస్త్రి ప్రవేశించును)

సూరి—సదాశివరావుగారు! సొమ్ముపంపుటకు వాయిదా సమీపించినది జాగ్రత్త పెట్టితిరా?

సదా—అందును గురించియే యోజింపుచుంటిని

సూరి—నేను వచ్చునపుడే సంజీవయ్యాగారు వర్తమానించినారు. రేపటెల్లుటినీయక తప్పదు. పెద్దమనుష్యులతోబని.

సదా—ఔను పంపక తప్పదు. మాఅమ్మాయికి కట్నమిచ్చుట యిష్టములేదు.

సూరి—చిన్నపిల్ల. ఆమెకేమి తెలియును లెండి. మనము వివాహము కా

స్త్రీకానిస్తే అల్లుడు, అమ్మాయి, చిలుక గోరువంకలలాగున తిరుగుతూయుంటారు. పిల్లలఆలోచన మనము వినడమూ, ఆప్రకారము నడవడమూ బాగానేయుంటుంది. పెద్దలు మీకు నేను చెప్పనక్కరలేదు గాని

సదా—లేదండి. నేనదే చెప్పుచున్నాను. అమ్మాయీ? మీరులోనికి వెళ్లండి శాస్త్రిగారితో కొంచెము మాటాడవలయును

(గుణవతి, సుమతి నిష్క్రమింతురు.)

సూరి—సొమ్మును గురించియేమి యోచించినారు.

సదా—అప్పులవాళ్ళను దేబరించడమేగాని సాధారణముగా ఋణము పుట్టదు. కాబట్టి మాన్యము విక్రయించుటకే నిశ్చయించితిని.

సూ—(తనలో) నా బావమరది పేరుపెట్టి నేనేకొంటినా బాగుంటుంది ఎన్నిరోజులు కష్టపడినా దినములు వెళ్లవు, గింజలింట్లోయుండే పైఖర్చు సులభముగా తెచ్చుకోవచ్చును. ఈవ్యవహారములో వెయ్యిరూపాయలు కమీషనుక్రింద వస్తువికదా? (ప్రకాశముగా) ఎంతసొమ్మున కెంతభూమి విక్రయింపదలచుకొన్నారు

సదా—క్వోటు రెంటు యీనాం పల్లం పందుముభూమి పంద్రెండు వేలవరకు రావచ్చును.

సూరి—(తనలో) యెకరము మూడువేలు కిమ్మతుగలదే? కాని చాలదనిచెప్పి యింకొక యకరము చేర్పించితినా యైదువేలు లాభమువచ్చును. కార్యావసరముచే లోబడకమానడు (ప్రకాశముగా) ఇప్పుడు భూములధరలు చాలాదిగిపోయినవి. అందరు అమ్మేవారేకాని కొనేవారులేరు. అయినా కాలీషగాబు వెంకటరత్నంతో చెప్పితిని. వచ్చుచునేయుండును.

(వెంకటరత్నం ప్రవేశించును)

సదా—వెంకటరత్నం రావోయి— ఇక్కడ కూర్చుండుము.

వెం—చిత్తము (అని కూర్చుండును)

సూరి— వెంకటరత్నము! సదాశివరావుగారికి పదివేలు బదులుకావలె నట. మాన్యము తనఖాయిచ్చెదరు.

వెం—అయ్యా! దస్తు హాజరు లేదండి. అయినా చూతాము. నెలరోజులు పోవుయ్యండి.

సదా—(ఆశతో) నెలరోజులుపరకు వాయిదాలేదు. వారంరోజులలోపున కావలెను.

వెం—అయ్యా! అంతసొమ్ము వారంరోజులలో సమకూడదు, అయినా వడ్డీసంగతి చెప్పండి.

సదా—నూటికి తొమ్మిదిచొప్పున నీయుము. పెద్దమొత్తము.

వెం—అయ్యా! ఎందుకీమొగమాటము- నూటికి నెలకు రు 1-9-0 లకు తక్కువవడ్డీకిఅయితే కుదరదు.

సదా—(నిరాశతో) అట్లయిన భూమి విక్రయించెదను. కావలసిన చూడుము,

వెం—ఏంతభూమి?

సదా—నిదానంబందలో పండుముభూమి ఒకటపరకం వల్లం.

వెం—ధర?

సదా—పండ్రెండు వేలు.

వెం—అబ్బో! అంతకిమ్మతుచేయదు. మీకిష్టమైన యెనిమిదివేలిచ్చెదను. రిజిష్టరీఖర్చులుమీవే, నాకు నిమిత్తములేదు.

సూరి—(కనుగీటుచు) పదివేలు కట్టుకొనుము, తునితగవు చెప్పితిని.

సదా—శాస్త్రిగారూ! నాకంగీకారము లేదు.

వెం—నేనింతకంటె నెక్కువ కట్టుకొనను.

సూరి—నామాటవినుము. ఎందుకు చెప్పితినో? (కనుగీటును)

సదా—ఆలోచించి కబురుపంపించెదను.

వెం—ఆలాగే యోచించండి నాకు సెలవు- (అని నిష్క్రమించును)

సూరి—నామాట విన్నాడు కాదు చూచినారా?

సదా—కోమట్లన్న వహార మట్టిదే. గాధముగాలోచింతురు

సూరి—సదాశివరావుగారు! యీకోకయాకరిముచేర్చి పది వేలకు విచ్చి వేయుదము. ఏమిచెయ్యుదము? సొమ్ము అవసరముకదా?

సదా—(తనలో) ఇప్పుడేమిచెయ్యవచ్చును (యోచించి) రోటతల బెట్టి రోకటిపోటునకు వెరవనేల? (ప్రకా) ఏదోయొకవిధము గా బరిష్కరించండి.

సూరి—నేను సెలవుపుచ్చుకొంటాను.

(ఇరువురు నిష్క్రమింతురు)

---

## 2వ రంగము.—గుణవతి పడకగది

(గుణవతి ప్రవేశించి)

గుణ—అహా! తండ్రీ! అనినంతయు జేసితివికదా? నామున్దు చెల్లింప వైతివి నాయంతఃకరణంబు క్రయానీతవనుని బెండ్లియాడవల దని నిషేధించుచున్నది. సకలపుణ్యకర్మల కాకరమై పుణ్యభూమియని ప్రపంచమున బేరెన్నికగన్న యీభారతజననిగర్భంబున ననేకసుపుత్రులుదయించి సంఘదురాచారంబు మాన్పింపజాలకుండిరిగదా?

గీ. సంఘసంస్కర్తలగువారు ♦ సంస్కరింప
వరలు హైందవసంఘంబు ♦ వర్జనీయ
కృత్యముల వీడకుంట దు ♦ ష్కృతము దైవ
మెపుడు వీరల సత్కృపా ♦ దృష్టిగనునొ?

ఇంకను నాజన్మవిశేషమని యెంచవలెను- ఏమన,

గీ. కర్మపరిపాకమో లేక ♦ కాలగతియొ
సాహచర్యంపుదోసమో ♦ జననకాల
తారకాగ్రహసముదాయ ♦ దత్తఫలమొ
వంచనీయుఁగఁజేసె నై ♦ వాహికమున.

హా పరమేశ్వరా! దయాసాగరా! బ్రహ్మేంద్రాదివందితచరణసరసిజా!
నీచేత లిఖితమలుగదా?

చ. ఇలగల భూతజాలముల ♦ నెంతయు నీవెగదా సృజింతు వా
వల నభివృద్ధినొందునటు ♦ పాలనజేయుచు మీఁద నాశమున్
జలుపుచు ఖ్యాతిగాంచెదవు ♦ సర్వసమత్వము నీకు లేదకో
చలమున నాదుపాపలకు ♦ జాలమునో వ్యధ జేయనేటికిన్,

హా భారతజననీ నీగర్భమునం దనేక పవిత్రస్త్రీలు ఉద్భవించి స్వే
చ్ఛావిహారంబున ప్రవహింపుచుండలేదా? నేనిపుడు యోగిని
నై చరింతమన్న సంఘంబున మాతాపితలకు బాధోత్పత్తి
కాకమానను. అవివాహితనై భగవద్దాస్యంబున గాలక్షేపం
బు నేసిన భగవంతుని మార్గంబునకు దూరముకాజాలనని నాకు
దృఢమైన నమ్మకముగలదు. ఐనను నేను స్వేచ్ఛగా జీవించి
యుండి తల్లిదండ్రులకు సంఘబాహ్యంబు గలిగింప మనం బొ
ప్పకున్నయది.

ఉ ఏటికి బూర్వకల్పమున ♦ నేడ్తెర పూరుషసృష్టిమాన్పి దా
మేటిమగండనంచు నిల ♦ మించిన స్త్రీజనసృష్టిజేసి మో
మోటము లేక దక్షుఁడీలు ♦ మార్పొనరించిన కారణంబుచే
నాటలుసాగుచుండె బురు ♦ షాళికిఁ గాంతల గొంతుగోయగన్.

గీ. మానినులకును మగలకు ♦ మమతయున్న
భువిని దాంపత్యమిసుగదా ♦ ముదము కేళిత

యైనపురుషుఁడు భార్యల ♦ నర్థాన్వృత్తి
జూచునట్టిదెధనమును ♦ జూచుగాని,

క॥ అనురాగ హీనుఁడగుపతి
గనుగొని సేవలనుజేసి ♦ కార్శ్యమునొందన్
వనితామణులకు మేలే
కనిపెంచిన యేఁకైన ♦ కాయముస్థిరమే

క్యారే భగవాన్' ఆప్ కా ఇచ్ఛాయి సీతరహీ హెూతో మైఁక్యాక రూఁగీ. ఆప్ మేరీఘాత్ మేఁ సుఖభోగనే కో నహీఁలిఖ్‌తే మై. అభాగినీహూఁ మేరీయహా బదన్ ధరతీకో భారభూత్ హెూగీఁ హైఁజీవన్ ఇస్ శరీర్ మేఁరహేనే సేకుఛ్ ఫాయదా నహీఁమాతా పితా వోఁకో మేరీపై దాహెూనే సేబడా తకలీఫ్ హుఈ భగవంతుని లిఖవముతప్పింప నెవరివశము భూమికి భారభూతమైన యీశరీర మెందుకు నాపుట్టుకవల్ల తల్లితండ్రులకు కష్టములే కలుగఁజొచ్చినవి. హా! మాతా! సకలసద్గుణోపేతా! నీగర్భంబున నుద్భవించినందులకు నీకానందంబు నకుమారు విచారము కలిగింపనంటిగదా? తండ్రీ! నామూలఁ బేదవైతివిగదా? ఉన్నమాన్యమమ్మి నాయొక్కతె కుద్వాహ మాచరించిన సోదరి వివాహ మెట్లు నిర్వర్తింతువు? స్థలభాండ విసర్జనమైనపిమ్మట నీవాఁబ్రదుకు వృత్తియేమున్నది? నీళ్లకావిళ్ళు మోతువా? లేక సీతారామా భ్యాంనమః అని జీవనోపాధికై బయలుదేరుదువా? నేను జీవించియుండి నీదారిద్ర్యదుఃఖము జూడనోపను. పోనీ వివాహముమాని యోగినినైయుండి నీకురాబోవు సంఘదూషణము నవిని సహింపఁజాల కావుననే నవస్యము మరణించియే తీరవలెను. గత్యంతరమేమియు గానిపించుటలేదు. ఆత్మహత్య మహాపాతకమేయైనను కావించుకొనక తప్పనిదుస్థితి

నచ్చినది. అవస్యమునాకుతిరిగి జన్మయేకలుగును. స్త్రీజన్మము మాత్రము రాకుండునట్లు పరమేశ్వరుని బ్రార్థించి మఱి నాయుద్యమము నెరవేర్చుకొందునుగాక

సీ॥ సకలచరాచరంబులను ♦ సాకెడువాఁడు దయాంతరంగుఁడై
హింకసుఖదుఃఖముల్ తనకు ♦ నెంతయుజెందనివాఁడు పూర్ణుఁడై
వికసితమూర్తియైనరలు ♦ వేదమయుండయి బొల్చువాఁడు మా
నక కృపనాకు నాఁడుజన ♦ నంబిల వేమియనుగ్రహించుతన్

గీ! పరమేశ్వరా! కరుణాసాగరా! నీచేత లతిచిత్రతరంబులుగదా? సకలచరాచర స్థితిలోకత్రయంబు సృజింపఁజాలు సామర్థ్యముగల నీవొక యాడుదానికి వరునింగూర్పలేక మర్మాణాభిముఖంగా వింపుచున్న నిన్నేమనగలదానను. నేనెట్లు మనగలదాన, నిన్ను నిందించిన నేమిలాభముకలదు. అవస్యమను భోక్తవ్యం కృతం కర్మశుభాశుభమ్మను నార్యోక్తి నాయందు వర్తించినది. ఓభగవానుఁడా! ఇదియే నాకడసారి సమస్కృతిగైకొనుము తల్లిదండ్రులారా మీకునే జనింపలేకనుకొనుడు, సోదరీ నాయందలి ప్రేమమురచిపొమ్ము. ఓభారతజనని! ఎంతకాలం బీవరవిక్రయ సంఘదురాచారంబు ప్రబలియుండునో యంతకాలం బాత్మగౌరము కలకన్యకా జనంబులకు నిట్టిమర్మరణంబు శరణంబై యుండు ఓసుందరశయ నాగారమా! నేటితో నీకును నాకును ఋణంబు లీనది ఓనాజ్ఞానవర్ధక పుస్తకంబులారా! నాకరకమలంబుల మిము స్పృశించు భాగ్యమిఁక లేదుగదా? ఓమృత్యుదేవతా యభాగ్యురాలనగు. నాకు బ్రత్యక్షము కాజాలవా రమ్మురమ్ము నీయొడియందునన్ను లాలింపుము నేనాత్మహత్య జేసికొంటినని నాతల్లిదండ్రుల నెవ్వరైన బాధింపజూతురు గావున వారికాబా

ధగాకుండ నొకకమ్ము వ్రాసియుంచెదను (అని అట్లుచేసి) చావకతప్పదుగదా? (యోచించి) జలాగ్నిరజ్జు విషంబులదేనిచే నైన చావవచ్చును. జలంబులబడిన నెవ్వరైనజూచిన సాహసించి తీయవచ్చును. రజ్జువుల మరణింతమన్నపై విధమునసే జరుగగలదు విషపానంబున ప్రాణంబులువిడువనున్న విరుగుడులచే మరల్పవచ్చును, అగ్నిహోత్రుని కాహుతియైననెవ్వరు మాన్పజాలరు. కావున తైలపూరితవస్త్రదాహంబున దేహంబు త్యజింతునుగాక. (అని తెరలోనికిబోవును తెరలోమంటలు)

(సుమతి సదాశివరావు ప్రవేశించి)

సుమ—అయ్యో! అయ్యో! ఎంతఘోరము. ఎంతసాహసము

సదా—అమ్మాయీ! ఈఘోరము భరింపజాలను ఇంతయోజననీకు గలదని తెలిసినచో నాయత్నముమాని యేదారిబోవువానికో కట్నమీయకయే బెండ్లిచేయుదునుగదా?

(తెరనెత్తగా అరటియాకులపై బరుండబెట్టబడిన గుణవతియు దగ్గఱకూర్చుండి చతురమతియు గాన్పింతురు.)

సదా—హాహా! మాకేమి గతిచెప్పితివి తల్లీ!

సుమ—(గుండెలుబాదుకొనుచు) అయ్యో! అయ్యో! మేమెంతనిర్భాగ్యులముగదే? మాకేదిదిక్కు, నీమాటలు నాకర్థముకాలేదు, నీవింత గొంతుకోసెదవని యనుకొనలేను. ఈదుఃఖమెట్లుభరింతునే.

సదా—విచారించను ఏమిచేయగలము. ఈకోతమనము జీవించియున్నంతకాలము మఱపురాదు.

చతు—అక్కా! ఏంతపని చేసితివే

సీ॥ ఈడుజోడుగనాట ♦ లెలమియాడుచుమోద
మందుట నేటితో ♦ మ్రింగెగాదె

చనువుచే నాకుఁ బ్రేమ ♦ చదువు రసముల
పాటించు భాగ్యంబు ♦ బాసెగాదె
లోకవిజ్ఞానంబు ♦ బ్రాకటంబుగఁ బొంది
సంతోషమందుట ♦ చనియెగాదె
యిరువురముఁ బ్రేమ ♦ మిను ముడింపగ నేక
శయ్యఁ బవ్వళించుట ♦ సమసెగాదె

గీ॥ ఎవరికై గూడు దున్నెవ్వార ♦ వీడు జోడు
నెవరు చదివింతు రిఁక కావ్యంబు ♦ నెవరు ప్రేమ
మీరఁ నాతోడఁ జరియింతు ♦ రారసాక్షి
యున్నయును గూడ నేటితో ♦ నంతమొందె

సుమ—అమ్మా! ఎంతపని చేసితివే మరచిపోవునది కాదుగదా?

సీ॥ నీ తెల్లి తేటలు ♦ నిముసమాత్రం బేని
మఱవ రాదే గదే ♦ మహానిబిడ
వీరూపు రేఖల ♦ నేరీతి మఱఁ బొంది
మనఁగ నేర్తు నె నేను ♦ మాన్యచరిత
నీయూహవర్తనల్ ♦ బాయువునా మది
యిఁక నెట్లు చరియింతు ♦ నెలఁత మిన్న
నీనిస్పృహత్వంబు ♦ మానితంబౌగద
యేమంచు వచియింతు ♦ నింక కూన

గీ॥ సర్వవిధముల జెడితిమి ♦ సన్నుతాంగి
మాకు నేగతి జెప్పితో ♦ మంజుభాషి
యెటుల దుఃఖంబు నీగుదు ♦ నెందు జొత్తు
మనసు పరవశమయ్యె యే ♦ మనుదు బిడ్డ!

సదా—అమ్మా!

సీ. కతినాత్ముఁడగువీని ♦ కార్యమేమున్నదం
చెంచి నాతోఁడ వ ♦ చించవేమి
అచ్ఛాత్మగౌరవ ♦ మణగించెఖలుఁడని
యెంచి నాతోఁడ ♦ వచించవేమి
సంఘదురాచార ♦ సమితికిలోఁబడె
నంచు దలంచి ♦ వచించవేమి
తనయ యభీష్టంబు ♦ ధ్వంసంబుగావించె
నంచు దలంచి ♦ వచించవేమి
గీ. ఘనతరంబగు శోకంబు ♦ గడచుటెట్లు
నీదుచయిదంబుల మరచి ♦ పోవుటెట్లు
లోకనిందను బాయఁ బా ♦ లుపడుటెట్లు
రెంటికిని జెడితిమిగదే ♦ మాటలేల?

ఆహా! నావంటిమూర్ఖుడు లేఁడు ఎంతయుడచికొన్న నాగక దుఃఖవా
రాసి పొంగి వేళ యతిక్రమించుచున్నయది.
(పోలీసుబంట్రోతు ప్రవేశించి)

బం—ఏమిటీగడబిడ సదాశివరావుగారు! మీయింట కూనీజరిగినదని
తెలిసింది నిజమేనా?

సదా—నిజమే

బం—శవాన్ని చూపించండి. రిపోర్టుచేసి పంచాయితీ చేస్తాం.

సదా—అక్కటా! యిదియొక దురవస్థ లెటస్థించినదిగదా! అయ్యా
మీయిష్టానుసారించేయుడు.

బం—ఇంతఘోరంపని చేయడానికి మీరేలబాధించినారు? మాకు తె
లియదు.

సదా—అయ్యా! కన్నబిడ్డనెవ్వరైన బాధింతు దుర్మార్గులుందురా?
మాదుర్దశ యిట్లున్నది.

బం—అయితే పిల్ల ఒల్లు కాలి చచ్చిపోయింది కాదు?

సదా—అవును

బం—ఏమైనా మీకు మాట అది యిది సెప్పింది లేదు?

సదా—చెప్పుట కేమున్నది?

బం—ఇటునటుచూచి అక్కడపడియున్న కాగితమునుదీసి యిది యే మిటి (అని చదివిచూచి) ఎంతఖర్మం, ఎంతవిచారం అయింది మాకు దీన్ని పత్రికలలో ప్రకటిస్తాం. మీనేరము లేదు (అని చెవిలో నేదియో చెప్పి వెళ్ళిపోవును)

సదా—బోటీ! మనకర్మమున కెవరుకర్తలు. ముందుసంగతిజూడవలెను.

గీ. రాగహీనంపు బెండ్లిని ♦ రమణిచేయ
దలచి సర్వలక్షణయుత ♦ దనుజగోలు
పోతివింగదా విచారంబు ♦ పోదుమనకు
దైవవంచనమనుటలు ♦ దగునె చెప్పుడు.

(అందరు నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.





శ్రీరస్తు

# వరవిక్రయము.

చతుర్థాంకము.



రంగము—సంజీవయ్యగారి న్యవహారపుగది.

సం—(ప్రవేశించి) ఆక్కటా! ఎంతదుర్మార్గము, ఎంతకష్టము. ఆపిల్ల చచ్చిపోయినందుకు నాకంతవిచారములేదుగాని తిరిగి అయిదు వేలరూపాయలు వారికి ముట్టచెప్పుట కేమనప్పుడు చచ్చినట్లున్నది. ఎన్నిరోజులు కష్టపడిన యింతసొమ్ము సంపాదించగలను!

గీ. ఒకటి పదియుగాదు ♦ నూరరంగవాదము
గాదు వేయిగాదు ♦ కడకునైదు
వేలు నెట్లు తిరిగి ♦ విడువంగగలవాడ
ప్రాణమైనవిడుతు ♦ గాని నేడు.

నాధనలక్ష్మి, నీవభివృద్ధినొందవలసినదేగాని విన్నమార్గమియు నాజీవము న్నంతవరకు క్షీణింపనీయను. ఎట్టిధనము వారికి హాని చేయ గూడదోయాలోచింపవలెను. అనూహ్యముఖ్యపడిపోయిన తి రిగి నీయనక్కరలేదు గాని యీలోపుననే మరణించి నాకొం పముంచినది. పోనీ యొకమేలేవచ్చినదిలే, డబ్బిచ్చి తెద్దనము గొని తెచ్చుకోలేదు. దానిగురించి కొంత తగులవేయవలసి వచ్చును. ఈరోజులలో యేదోపంతబెట్టి యుగవేసినవాడే నుం చివాడు. సదాశివరావుగారు పేచీమనిషి కాదుగదా? ఆలోచిం

చి పేచీకివస్తే నేనేమి చేయవలసియుంటుంది? ఏదియు తోచుట లేదు. (అని ఆలోచించుచుండును)

(సూర్యనారాయణరావు ప్రవేశించును)

సూర్య—నాయనా! యేమాలోచిస్తున్నావు? నీలుబ్ధత్వము యెంతసారభ్యముగా ప్రతిపత్రికలోను వర్ణింపబడినదో చూచినావా?

సం—ఎవరైనా యిమ్మంటినా, తెమ్మంటినా? ఎందుకు పేపర్లలో ప్రకటించడము?

సూర్య—ఒక్క విన్నగురించియే గాదు. ఆపిల్లదుర్మరణమునకు నీవే కారభూతుడవు నిన్నుంచే చనిపోయినది అది వ్రాసిన యుత్తరము కూడ యిందులో ప్రకటించినారు చూడు?

సం—ప్రకటించని నన్నేమి చేస్తారు? నాకేమిభయం, యీటాటాలు నాదగ్గర సాగవు ఇంక పదిసారులు ప్రకటించని?

సూర్య—అన్యాయము వదలుకొన్నవాని నెవరేమి చేయుగలరు? ఆయుత్తరము చూచిన నాకడుపు తుమ్మలుచుట్టుకొని పోవుచున్నది.

సం—ఎంత మొండికట్టైవురా? ఆలులేదు, చూలులేదు, కొడుకుపేరు సోమలింగం అన్నట్లు యింకను పెండ్లికాలేదు, యేమియు లేదు పిల్లకోసం విచారిస్తున్నావు?

సూర్య—నేనందుకొరకు విచారించుటలేదు. కాని నీలోభితనంకొరకు విచారిస్తున్నాను.

సం—నీకేమి తెలియునురా? "కాసు గలవాడె రాజు" అనుసంగతి నీకు తెలియదు కాబోలు.

సూర్య—నాయభిప్రాయము చెపుతానువిను ఎవరిపిల్లటకానిమ్ము. కట్నము నాకక్కరలేదు. కట్నమిస్తానంటేకూడ వేనోప్పను.

సం—మంచిప్రబుద్ధుడవే? పైగా యెక్కడనైన అనేవుసుమా? నా దగ్గరగనుక సరిపోయినది. అవికావలె నివికావలెనని నాప్రాం

ములు కటకటలాడింతువు కాబోలు

సూర్య—ఏదడిగితే అదల్లా యిస్తున్నావని?

సం—అదిగో! అదే- నోరెత్తకు. నేను మంచివాఁడను కాను.

సూరి—(ప్రవేశించి) ఏమిటండి అబ్బాయిని కోపపడుచున్నారు?

సం—ఏమని చెప్పను శాస్త్రీ, నాపనిఅంతా యీలాగు వ్యర్థము గావుంది

సూర్య—నాయిష్టానుసారం యేమిచ్చావు? (అని నిష్క్రమించును)

సం—చూచినారా, కుఱ్ఱవాళ్ళపోగరు. ఈరోజులలో కుఱ్ఱవాళ్ళు కు

ఱ్ఱవాళ్ళుకారు- తల్లిదండ్రులమాటఅంటే వినిపించుకోరు.

సూరి—అందుచేతనే నీతిశాస్త్రకారుడు,

క॥ ఆలినిహాయమును గజమును

బాలుని బాలత్వమునను ♦ పనిగొనకున్నన్

బాలుఁడు బడుగై పోవును

ఆలివినదు గజముచంపు ♦ నశ్వముతన్నున్

(అని చక్కగ నుపదేశించినాఁడు)

సం—ఎందుకు యొకరిబిడ్డను మనమెందుకు కోపపడడమని యోచించి

అడిగినదల్లా నోటితో లేదనక చేతితో లేదనుటున్నాను

సూరి—సంజీవయ్యగారు? సదాశివరావుగారిచ్చిన సొమ్ము వారికితిరిగి

వప్పగించవలెనుగదా? ఏమంటారు?

సం—(గుండెబాదుకొనుచు) నాకొంప నట్టేటకట్టినావే? వారిమ్మంటు

న్నారా యేమిటి?

సూరి—(తనలో) ఇప్పుడు బెదరించి యేమైనా లాగవలెను. (ప్రకాశ

ముగ) అయ్యా? మొన్ననే కబురంపినారు పనితొందరలచేత

మీాదర్శనము చేయలేదు.

సం—(బ్రతిమాలుచు) ఈగండంతప్పిస్తే నీమేలెన్నటికి మరచిపోను

నీయిష్టమువచ్చినట్లు నడుస్తాను.

సూరి—ఏమిస్తారు మీవల్ల వారికొకదమ్మిడికూడమీ రీయకుండ జేస్తాను.

సం—మామూలు ప్రకారమే

సూరి—అట్లయిన నొక యోచనవినండి

సం—ఏమిటది?

సూరి—సదాశివరావుగారి రెండవకుమార్తె పది సంవత్సరములున్నవి. ఆపిల్లను అబ్బాయికి వివాహంచేసికొనండి మీకుతిరిగి ధనము వాపసు చేయనక్కరలేదు.

సం—(కౌగిలించుకొని) మంచివాడవు నాయనా. ఆలాచేయించు నీపుణ్యమాఅంటూ బ్రతుకుతారు.

సూరి—నేనువెళ్లి అన్నిమాటలాడి సరిచేసికొనివస్తాను

సం—నీవువచ్చేవరకు నాప్రాణం బొందిలో నుండదుసుమా?

సూరి—పరవా లేదు.

(అని నిష్క్రమింతురు)

2 వరంగము—సదాశివరావుగారి యిల్లు

(సుమతి, సదాశివరావు, సూరిశాస్త్రి చతురమతి, ప్రవేశింతురు)

సుమ—అయ్యో? నాకూనా? ఎన్నివిధములమరచిపోవమన్నను మరపు రాకున్నదే?

గీ॥ నిండుచంద్రునిబోలెడు ♦ నెమ్మొగమ్ము
కల్వరేకులనిరసించు కనులసొగసు
మధురరస మొప్పుతిన్నని ♦ మాటతీరు
నెట్లుమరచెదుదాననో ♦ యెఱుఁగబిడ్డ

సదా—ఆహా? మాటలయందెంత మెత్తతనముగలదో యూహలయం దంత తెలివికలదు. ఎందులకు విచారించిన లాభము లేదు. అద

వినిగాచిన వెన్నెలవలె యైపోయినది.

సూరి—అమ్మా? ఊరక వెంగటిల్లుటయే కాని కలసివచ్చునది లేదు

సదా—శాస్త్రిగారు? అర్ధప్రాణములు రెండింటికి చెడితిమి. సుఖముగ
గాలక్షేపము చేయు మాన్యమా విక్రయించితిని. అన్నివిధముల
చెడిపోయితిని.

సూరి—అయ్యా! గతించినదానికై విచారింపకుడు. పోయినపిల్లరాదు
గాని డబ్బువచ్చు యోచనచెప్పెదను లెండి.

సదా—ఏయాలోచనము చెప్పెదరో నాకష్టము తీరుస్తురూ

సూరి—చిన్నఅమ్మాయికి పెండ్లిచేయవలెనుగదా?

సదా—అదియింతయైనది. ఇంకదీ నిమాట తలపెట్టకండి

సూరి—కాదు నేనుచెప్పునదివినుడు ఈపిల్లనెవరికైన నిచ్చునపుడు
కట్నమీయవలెనుగదా! యీఅమ్మాయిని వారికిచ్చివేస్తిగా
తిరిగికట్నము మనమీయవక్కఅలేదు. యిదేమనకు లాభము.

సదా—(నిరాశతో) అయ్యా? నేనిందులకు వప్పుకొనను అమ్మాయి
యిష్టముగాని నాయిష్టముకాదు.

సూరి—అమ్మాయి! నీయిష్టమేమి.

చతు—(తనలో)

గీ॥ అక్కరో నీవు శపథంబు ♦ నాచరించి
విమలయశమునుగాంచితి ♦ పృథివియందు
నేనునయ్యదిబూనితి ♦ నేనిలోక
మందుదుష్ట నడతలెట్లు ♦ డిందుజెపుదు

కావున దుష్టమతుల రసింపజాలు జాలంబు పన్నవలెను. (ప్రకా
శముగా) అయ్యా? నాతల్లిదండ్రులంగీకరించిన నాయభ్యంతర
మేమియు లేదు.

దా—

గీ॥ మాణిక్యమువంటి గూతురు ♦ మ్రిందెయికను
పెండ్లిమాటయె దలపగ ♦ వెరతుసుమ్ము
కూతురెట్టులజెప్పునో ♦ కూడదనగ
నామశక్తియొకింతియు ♦ లేదునిజము
శాస్త్రి? మాఅమ్మాయి మాటకునే జవదాట నోడుదును.
చతు—పెద్దల యిష్టానుసారంబునకు వ్యతిరేకింపజాలను.
సు—అమ్మా! బాగుగ యోచించి మరిచెప్పుము
చతు—ఇప్పుక పెండ్లియాడుదును
సదా—శాస్త్రి మాఅమ్మాయి యంగీకరించినదిగాన సంబంధముస్థిర పరచుడు! (చతురమతితో) అమ్మా! అక్కఱవలదనిన పనిచేసి మోసపోయితిని. నీకిష్టమేయైన వచింపుము.
చతు—తండ్రీ! నాకంగీకారమే. ఏమన
చ॥ మడియుచుమాన్యముల్ క్రియముమానకసల్పివివాహమెంతయున్
దడయక చేయనెంచితివి ♦ తద్దయునయ్య దివ్యర్థముయ్యెనే
కడకవివాహమాడనని ♦ కార్యము విఘ్నముసేయనొల్లనే
న్పడప్రతికూలమున్ హృదయ ♦ పద్మమునందు దలంచియుంటచేన్
సదా—అంతయయిష్టమైన నంగీకరింపకుము.
చతు—తండ్రీ! మీకాభయమక్కరలేదు. వివాహయత్నము గావింపుడు. (అందఱు నిష్క్రమింతురు)

---

3 రంగము- పెండ్లిపందిరి.

(సదాశివరావు వివాహకంకణధారియై యిటునటు తిరుగుచు ప్రవేశించును)

సదా—ఈరోజులలో నైదురోజుల వివాహముచేయువాని ముక్కుచెవులు కోయవలెను.

చం॥ అలుకదీర్పఁగొంత సమ ♦ యంబుహరించును బంధుకోటిఁగొం
పలకలతీల్ నివారణము ♦ వారక జేయగఁగొంత యొగువే
డ్కలయురి గొంతపోవు తగ ♦ కాన్కలదీర్పఁగ తీరుబాటులే
దిలగుమార్తె బెండ్లిరచి ♦ యించెదుచాలకు నెగుజ్జాలివన్

రామ! రామ! పెందలకడభోజనమునకు రమ్మనమనిన విస్తరాకులిలేద నిదము, పొద్దుపోయినసరిదాఁక బ్రాలుపోయమునిదము పెక్కువిధం బుల వియ్యాలవారు తిప్పలబెట్టుదురు ఇపుడొక కొరలవాటు ప్రారంభమైనది. కాఫీలు, ఉపమాలు, పెసరట్లు దోసెలు, ఇడ్డెనలు, అట్లు, ఇక నెన్నియో యుదయమున పెండ్లివారు లేచకుం డగనే పంపవలెనట పంక్తిపంక్తికి నున్న తాసనములనుర్చి వియ్యా లవారు వచ్చుసరికి నన్నమంతయు నాయిగనే సంసిద్ధపరచి యుం చవలెను. వడ్డనలో నేమాత్రము పొరపాటులైన, యుండరా ములు లేవుకదా

(సూరిశాస్త్రి ప్రవేశించును)

సూరి—సదాశివరావుగారూ! మీరు సంకల్పసిద్ధులుసుమండీ.

సదా—ఇదంతా మీయాశీర్వచన ప్రభావమే

శా॥ నష్టద్రవ్యముగూర్చ్చి నాడవుగదా ♦ నాడెంపు సొట్టంబవై
స్పష్టంబయ్యె భవత్ప్రభావముగఁ బూర్ ♦ వాటించిచూడంగనే
లిష్టంబుల్ సమకూడెనాత్మజకు నెం ♦ తే మోద మొప్పారె సం
తుష్టంబున్ సుఖమున్ ధనంబుపడలెన్ ♦ స్తుత్యాత్మ మీసద్దయన్.

సూరి—అంతయు దైవాయత్తముగదా? ఇందు నాప్రతిజ్ఞ యేమియు లేదు. సంజీవయ్యగారీరోజున సదస్యము కావున పెందలకడ యూరేగింపు చేయుదురట. కాఫీ వగైరాలు త్వరగబంపుడని చెప్పిరి. తాము తొందరపడవలయును.

సదా—ఇదిగో పంపించెదను. [అని లోనికేగును.]

సూరి—ఇప్పటి కీవ్యవహారములో రమారమీ పదివందలు చేతిలోప డినవి. సదాశివరావుగారిదగ్గర సొమ్ము వ్రియమయిపోయిన నాకువచ్చునది యాలస్యమగును కావున నేదియోవంక బెట్టి చేపట్టవలెను,

సదా—[ప్రవేశించి] పంపించితిని. శాస్త్రీ! వివాహము సలక్షణముగ జేయుట మహాకష్టము.

సూరి—కాదా, నిన్న వియ్యపురాలుసికిచ్చు లాంఛనములో నేదియో కొరతజరిగినదట, ఈదినమున వియ్యపురాలుగా రలగినారు. మీఆవిడనుబంపి ఆతగాయిదా తీర్పించండి. నిన్నరాత్రి ఎవరో పెండ్లివారి నాక్షేపించినారట. వారందరుమీపై దండెత్తనుండిరి నేనుచాలవరకు బ్రతిమాలి యాపితిని. కాని ఇంకొక పెద్ద తగా యిదా రాబోవుచున్నది.

సదా—ఏమది.

సూరి—వియ్యపురాలు లాంఛనములక్రింద మనమిచ్చెదమన్న కట్న ములోసఖము ముట్టచెప్పలేదుకదా. అదివెంటనే పంపించండి.

సదా—రెండు వేల యైదువందలే

సూరి—జౌను

సదా—శాస్త్రీ! ఇంతవరకు మనమీయలేముకదా?

సూరి—ఎంతవరకు మీకూహగలదో నాచేతికీయుడు. పైసంగతి నే నాలోచిస్తాను.

సదా—ఇదిగో వేయిరూపాయిలనోటు (అనియిచ్చి) దీనితోవారిని తృప్తిచేయండి.

సూరి—మీయిష్టము– నేనువెళ్ళి యన్నీ సానుకూలంచేస్తాను. (పరిక్రమించుచు) ఇందులో నొకపైసయైన వారికీయను. (నిష్క్రమించు)

మించును)

సదా—ఆహా! "వివాహము చేసిచూడు, యిల్లుకట్టిచూడు" అన్నమాట వ్యర్థముకాదు. తెచ్చినపదివేలు పూర్తియైనవి కాని వివాహసమాప్తి కాలేదు.

(వంటబ్రాహ్మణుడు బుచ్చయ్య ప్రవేశించి)

బు—పంతులుగారూ! పెండ్లివారు భోజనములకై వచ్చుచున్నారు. తగినయేర్పాటు చేసినారా?

సదా—అప్పుడేనటోయీ!

బు—ఈరోజున సదస్యముగాన చల్దిభోజనములకై వచ్చుచున్నారు.

సదా—అలాగునా? లోన నేమిచేయుచున్నారో చూచిరమ్ము.

బు—(లోనికివెళ్ళి) ఇంకా వంటలుకాలేదు. తొందరగా కానియ్యండి

(నిష్క్రమించును)

సదా—నేనాయత్నమందే యుండెదను- (నిష్క్రమించును)

## 4వ రంగము- పెండ్లిపందిరి.

(పెండ్లికొడుకు, పెండ్లికూతురు పీటలపైని, పురోహితుడు, సంజీవయ్యగారు, మొదలగువారు ప్రవేశింతురు)

పురో—అయ్యా! సరస్వతీపూజకుచాపు పైవులు దయచేయించండి.

సం—ఏమండోయి చాపు అక్కఱలేదనుకున్నాము కాదు. వయిపులెందుకండి- తమలపాకులలో రెండక్షతలు వేయిస్తుగూ చూడండి యిదంత లాంచనములుకాని మరియొకటి కాదుగదా?

పురో—మహారాజు మీరే యీభాగు సెలవిస్తే యింక చిల్లరవాళ్ళసంగతి యేమిచెప్పవచ్చును.

సం—నన్ను మాటిమాటికి అడగకండి ఇదిగో దీనితో పూర్తిచెయ్యం

డి, అంతా మీకు వివాహమైనతరువాత ముట్టచెప్పుతాను (అని యొకఅణాయిచ్చును)

పురో—(తనలో) ఆఖగున చెప్పేదియేముంది యెప్పటి కప్పుడేచేతిలో వేసికొనవలయును- (ప్రకాశముగా) అయ్యా? తామెఱుంగని దేమున్నది. కనీనమొక పావులామైన నుండవలెనుకదా?

సం—ఏమండోయి నామనవివినండి. నలుగురిలో మీరీలా గనడం నేనా లాగనడం బాగుండదు. కానియ్యండి.

[అక్క-భొట్లు ప్రవేశించును]

అక్క—ఏంతులుగా రూ! మనవి.

సం—ఇదిగో [అని యిరువురు పరక్రమింతురు]

అక్క—సదస్యములో మీరు భారీగా వెళ్లకపోతే గౌరవమునకు లో టుగానుంటుంది.

సం—అక్క నొట్లు యేమాటి ఖర్చుపెట్టవలెను.

అక్క—చాపులు, కాసులు, రూపాయలు, పండితబహుమానములు యినన్నియు కావలెను.

సం—చూడండి, సూక్ష్మంగా అయ్యే యోచనచెయ్యండి- మీరు మాకు పనిమిత్రులైనందుకు వ్రయముతగ్గించి మాచేత మె ప్పుపొందవలెను.

అక్క-—మీరు సెలవు- నేను చెప్పినదానికల్ల మావల్లకాదందురు, ఆపై ని యోచిద్దాము -

సం—నేనా పాటికార్యము తెలియనివాడనా? [ఇరువురువచ్చి కూర్చుం దురు]

పురో—అయ్యా! సరస్వతీపూజదగ్గర సువర్ణమంత్రపుష్పం దయచే యించండి-

సం—ఎంత?

పురో—మహానుభావులు, లక్షాధికార్లు, మూటపదార్లు రావలెను

సం—మూటపదారులే, సువర్ణము రాగిలోనుంటుందికదా? కాబట్టి యీడబ్బు నక్కడనుంచండి- [అని కానియిచ్చును]

పురో—అబ్బే! ఘనముగా నాలోచించవలెను,

సం—ఏమి? చేదుగానున్నదా అబ్బేఅంటున్నారు- ఇంకాముందుందికాదూ- కానియ్యండి

అక్క—మిమ్ముల నాశ్రయించి కనిపెట్టియున్నారు- గొప్పగా దయచేయించండి-

సం—అందుకేకాదూ లేదనకయిస్తున్నాను? కానియ్యండి.

పురో—మీచిత్తము. సభాకట్నమిప్పించండి.

సం—సభాకట్నమా?

అక్క—ఔను- తమరిప్పించవలసినదే.

సం—ఎంత?

అక్క—ఇది గ్రామత్వేన రావలసినది కావున మీచిత్తం, తమరెరుగనిదిగాదు.

సం—చెప్పుదురూ?

అక్క—సభాపతిగారు సెలవిస్తారుగదా? కట్నమునకు నూటికి రూపాయిచొప్పున దయచేయించమంటున్నారు.

సం—సంభావనఅంతా కలసియేనా?

అక్క—కాదండి, సభాకట్నంమాత్రం

సం—నేనైతేమాత్రం కోటీశ్వరుడనా? నాదగ్గరమాత్రం యేమున్నదనుకొన్నారు? కావలిస్తేడబ్బు, రెండుడబ్బులు కోంవచ్చును. అంతేగాని తాహతుమీరి యడుగరాదు.

బ్రా—అయ్యా! ప్రభువులు, మీరాలాగున సెలవియ్యకండి.

అక్క—(దగ్గరచేరి) యేదో ఒకరూపాయి యిస్తురూ?

సం—రూపాయే, నాతోటి చెప్పకండి

అస్క—నామనవి వినండి, పదహారుఅణాలు.

సం—పదహారుకానులు (అని పావులాయిచ్చును)

బ్రా—వద్దు వద్దు.

సం—(తిరిగిపుచ్చుకొని) సంభావనలో కలిపి యిస్తానులెండి

బ్రా—ఆహా! యెంతటిదాతలండి, సంభావన యిప్పించండి

సం—(తలకొక కానిచొప్పున యివ్వబోవును)

బ్రా—చాలును, లేవండి

ఏకైకగుడ్డు కులపండితానాం
దుడ్డుద్వయం కుండలపండితానాం
యాగాని యాగాని యతీశ్వరాణాం
రోళిద్వయం చిల్లరబ్రాహ్మణానాం.

అని మాబాగా చెప్పినాడురా, పదండి పదండి.

గీ. మనుజమాత్రుఁడెవఁడు బోని ♦ మార్గమునను
జనగనెంచెనులోభియై ♦ చాలునింక
పదుడుపదుడు బాపలుమీరు ♦ వాదులేల
చాలియుండిన స్థలములు ♦ చాలగలవు

(అందరు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము





శ్రీరస్తు

# వరవిక్రయము.



## పంచమాంకము.

—※—

రంగము - ప్లీడరుగారి కచేరీసావడి.

(పడకకుర్చీపై ప్లీడరు జనార్దనము ప్రవేశించుచున్నాడు)

జనా — ఈరోజులలో వృత్తులన్నిటిలోను నధమవృత్తి ప్లీడరువృత్తియే. యేమన

ఉ॥ సత్యము రూపుమాపుచు నస ♦ త్యము సాక్ష్యములిచ్చునట్లుగా
నిత్యము బోధసల్పుచును ♦ నిందితకృత్యములెల్ల జేయుచున్
భృత్యునిరీతి వారికని పీరికి ♦ సేవయొనర్చుచున్ సదా
ప్రత్యయకారుడగు ♦ వాడుగదా భువిప్లీడరెన్నగన్

పైకిబటారము లోనలొటారమనునట్లు డాబుసరి లేకున్న వీలుండదుగదా పటాటోపో భయంకరః అనునట్లు బాగులోనున్నప్పుడు పెద్దయెల్లరిగ కేకలవైచుచు నితరులమాటలు సాగనీయక మాటాడువాడే చక్కనిన్యాయవాది. కేసులుండిన నుండకున్న పదిగంటలకు భోజనము, గోటునీటు, గుఱ్ఱపుబండిపై కోర్టునకేగుట, అటునిటు తిరుగుచు కనబడినపార్టీలతో ముచ్చటించుట, కాఫీహోటలులలో ఫలహారము. ఇవన్నియు తప్పవుకదా? పకారపంచకముదగ్గఱ ధనముండదుగదా? పట్టుమని రెండుకేసులైన లేవు వేషముమాత్రము తప్పదు. బీరువాలనిండ కొన్ని లావు

స్తకము లుండవలెన్నుగదా? కేసులుతీసికొనివచ్చి తగవరికేమ యిన నీయవలెను. అదిగో ఎవరోవస్తున్నారు.

(సంజీవయ్య ప్రవేశించును.)

సం—(తనలో) అయిన పదివేలనగలు, పిల్లవారికే దక్కించిఅన్న మా టే. ఏలాగునదక్కుతుంది నాబొందిలో ప్రాణంవున్నంతవరకు దక్కనీయను. అగ్నిముఖమున కీడ్చిస్తే గంగరావిచెట్టుక్రింద గాని ఫయిసలు కాదు.

జనా—సంజీవయ్యగారా? దయచెయ్యండి (అని కుర్చీచూపును.)

సం—(కూర్చుండును)

జనా—బహుకాలదర్శనం ఏదోవిశేషములేనిదే రారుగదా?

సం—ప్లీడరుగారింటికెందుకు పార్టీలువస్తారో మీారెఱుగని దేమున్నది? ఈమధ్య ఎట్టాప్రగడ సదాశివరావుగారి అమ్మాయిని మాఅ బ్బాయికిచ్చి వివాహంజరిగించినాము.

జనా—ఔను, ఆసంగతినాకు తెలియును.

సం—వివాహ సమయంలో పదివేలనగలు పెండ్లికుమార్తెకు బెట్టితిని

జనా—సంతోషమే, మీాకదియొక లక్ష్యమా. లక్షాధికారులు

సం—లక్ష్యములోనిదికాదు గాని సవ్యముగానడిస్తే అన్నీ బాగుండును.

జనా—ఇపుడేమి వ్యతిరేకము సంభవించింది.

సం—వ్యతిరేకమో అతిరేకమో ఏమనిచెప్పను! పిల్లదానితండ్రికి దురు ద్దేశము ప్రబలినది.

జనా—అదిమీాకెట్లు తెలియును?

సం—పిల్లనత్తవారింటికి బంపుటలేదు సరికదా వస్తువుల హరించుటకై యత్నిస్తున్నాడు. కావున మననగలుమనకు వచ్చునట్లును పిల్లకు మనకు సంబంధమేమీా లేకుండునట్లు మనోవర్తికి దావాచేస్తే మనమేమీా యివ్వకుండా నుండేయుపాయం చెప్పాదురూ.

జనా——(చిటికలు వేయుచు) అదెంత సేపు లాయరు నోటీసు యిద్దాము
అందుతో హడలిపోయి మీకోడలును పంపించివేస్తారు.

సం——మాకాసంబంధంవద్దు ఏమీవద్దు.

జనా——అట్లయితే తగినయేర్పాటు ముందు చూద్దాముగాని నోటీసు యివ్వవలెను.

సం——ఆలా జరిగించండి.

జనా——సరేకాని దీనితో సరిపోతుందీ. కేసు ఫైలు చెయ్యవలెనుగదా. ప్లయింటుఖర్చులకు కొంతసొమ్ము పంపించండి ఫీజుమాటఆనక చూద్దాము.

సం——ఆలాగుననే. నేను సెలవు పుచ్చుకొంటాను

జనా——తమరువచ్చేసరికి నోటీసు వ్రాయిస్తాను

సం——(పరిక్రమించుచు) ప్లీడరుతోను, గణికతోను మాటాడిన ధనములాగక మానరుగదా?

ఆ. వె. చనవు బలిమి కలిమి ♦ ధనమును హరియించు
బిగువు వగపుజూపి ♦ వేశ్యకాంత
గోటునీటుజూపి ♦ కోరికలూరించి
విత్తహారియగును ♦ ప్లీడరరయ.

న్యాయాలయములు జలాశయములు, ప్లీడరులు పార్టీల ధనరక్తమును బీల్చు జలగలు, గెల్చినవాఁ డింటిలోను, యోడినవాఁడు బయటను రోదనము చేయకపోరుగదా! (నిష్క్రమించును)

(తెర వ్రాలును)

2వ రంగము- సదాశివరావుగారియిల్లు.

(చతురమతి, సదాశివరావు ప్రవేశింతురు)

సదా——అమ్మా! చూచితివా? పేచీలు మనకెందుకని చెప్పిన నీవు వినవు. ఇదిగో నోటీసుచూడుము.

చతు—నాయనా! మీరిందువిషయమై యడలకుడు. అన్నియు నేను చక్కజేసెదను నోటీసు యేది?

సదా—ఇదిగో- (అని యిచ్చును)

చతు—(చదువుచున్నది)

## రిజష్టరు నోటీసు.

ప్లీడరు, బి జనార్దనం
బి. ఏ బి యల్,
హైకోర్టువకీలు
వారిఆఫీసునుండి

మహారాజశ్రీ
ఎఱ్ఱాప్రగడ సదాశివరావుగారికి.

మాక్లయింటు యిచ్చిన సముజాయిషీప్రకారం మీకు తెలియచేయునది యేమనగా?

మీకుమార్తెను అత్తవారింటికి పంపించక వస్తువులను హరించునుద్దేశమున్నట్లును తెలిసి వారివల్ల తగాయిదాపొందుతూవుండిన్ని పిల్లను కాపురమునకు పంపించుట లేదు కావున యీనోటీసుఅందిన 24 గంటలలోగా మీకుమార్తెను వస్తువులసహితం కాపురమునకు పంపించి వస్తువులు ముట్టినట్టు మాక్లయింటువల్ల క్రమమయిన రసీదు పొందవలెను. ఆలాజరిగించనియెడల మీపయిన దావాచేసి క్రమప్రకారం ఖర్చులతో వసూలుచేయబడును అని యిందుమూలముగా తెలియజేయడమైనది.

చిత్తగించవలెను,
బి జనార్దనము, బి. ఏ. బి. యల్.,
హైకోర్టు వకీలు.

నాయనా! దావా చేయనీయుడు. సమాధానమేమియు నీయవలదు.

సదా—దావాచేస్తే మనమేమిచెయ్యగలము అయినా కానీ ఆడవాళ్ళు కచేరీలవెంట తిరగడం మరియాద కాదు

చతు—నాయనా. ఇప్పుడావిధి నిషేధములులేవు, ఇందునుగురించి తాము చింతింపకుడు.

సదా—నీయిష్టము, సభలకెక్కడము కోర్టులకెక్కడము మంచిపనికాదు

(ఇరువురు నిష్క్రమింతురు)

(తెర వాలును.)

### 3 రంగము– మునసబుకోర్టు

(న్యాయాధిపతి, ప్లీడరు జనార్దనం, సంజీవయ్య, సూర్యనారాయణరావు, సదాశివరావు, చతురమతి వగైరాలు ప్రవేశింతురు,)

జనా—హేమహాశయ! ఆప్ కేకోర్టు మేఁఏక్ ముకద్దమా ఫైల్ గయా హై ఉసే ఆప్ తసఖీకర్ సకతేహైఁ

న్యా—ఓహా అచ్ఛా తసఖీకర్ సకతాహూఁ ఉస్ కేస్‌మేఁవాది ప్రతివాది యోంకో బులావో

జనా—జవాన్! సూర్యనారాయణ రావు. సదాశివ రావులను పిలువుము

జవాన్—సూర్యనారాయణరావు, సదాశివరావు (అని ముమ్మారుపిలచును)

సూర్య—అయ్యా!

జనా—కేసులో వాది ప్రతివాదులు హాజరుగానున్నారు. విచారణచేయించవచ్చును.

న్యా—ఈ కేసులోని కాకితములన్నియు చదివిచూచితిని, రాజీపడిన బాగుండును.

జనా—ఇది రాజీకేసుకాదండి, మాక్లయింటుఇందున కంగీకరింపడు,

న్యా—నాకు రాజీపడుట మేలని తోచుచున్నది.

స—(తనలో) అయినసొమ్ము నష్టపోయినేను రాజీపడుతానా? (ప్రకా) నాకిష్టములేదు.

న్యా—నీ వెవరవు.

జనా—అయ్యా! మాక్లయింటు తండ్రి,

న్యా—ఇస్‌నెం ఇస్‌కా అడచన్ క్యాహై

జనా—వహ్ కహతాహై కి బహూసే అనసన్‌నహీంహై ఔర్ జవాహిరి యత్ వాఫస్ కరనేకో హుక్మ్ దియేతో బస్‌హై. (కోడలువద్దు నగలిప్పిస్తేచాలును)

న్యా—సదాశివరావు! ఏమిచెప్పుతావు?

సదా—అయ్యా! నాకు ప్లీడరులేను. కోర్టువారికి తోచిన న్యాయము దయచేయుడు.

చతు—అయ్యా! తాము తండ్రిలు, నేను మీకుమార్తెను.

న్యా—యహ్ లడకీ కౌన్‌హై

జనా—యహ్‌మేరా క్లయింటుకీ బారత్‌హై. అయ్యా? యీకేసునకు కథానాయిక యీమెయే.

న్యా—అమ్మాయీ! నీవేమిచెప్పెదవు?

చతు—ఆర్యా! ఇందు నాతండ్రిదోష మేదియులేదు.

న్యా—అటులయిన నీవత్తవారింటికి వెళ్ళుటకు సమ్మతింతుటలేదా?

జనా—ఇస్ లడకీ పక్కాహోషియార్‌హై. చాలా గడుసుబుఱ్ఱ.

న్యా—నీవూరకుండుము.

జనా—ఆప్ కాఇచ్ఛా.

న్యా—అమ్మాయీ! నీవు చెప్పదలచినది చెప్పుము.

చతు—ఆర్యా. నేనత్తవారింటికి వెళ్ళనవసరములేదు.

సం—మాయింటికి రావద్దు. నగలుమాత్రి మిప్పిస్తేచాలును

చతు—నగలు మీకీయవలసినసబబులేదు.

న్యా—ఎందుచేత?

చతు—వివాహకాలమందుంచుటచేతను, స్త్రీధనము

సం—(గుండెబాదుకొని) ఇంతయాలోచనవున్నదని యెరుగను, నన్ను గంగలో దింపినావు,

న్యా—నీయల్లరియేమి! మాటాడకు

సం—అంతసొమ్ము నష్టపోయి నేనెట్లూరకుందును.

జనా—అల్లరిచేయకండి. వారివాదము విందాము

న్యా—అచ్చా' అత్తవారింటికి యెందుకు వెళ్లవు?

చతు—అయ్యా! న్యాయముగా వివాహమైన నత్తవారింటికి వెళ్ళవలసినదాననేగాని—

న్యా—ఇందు వ్యతిరేక మేమున్నది?

చతు—ఈవరునినేను అయిదువేలకు క్రియమునకు దీసికొంటిని.

సం—లేదులేదు అబద్ధ మబద్ధము, అదికట్నము

చతు—కట్నమయిన వివాహసమయంబున పెండ్లిపీటలపై వరునియలంకరించి యివ్వవలెనుగాని పరిణయమునకు ముందుగా బజానాలు, రశీదులుఎందుకు?

న్యా—ఇది నిజమేనా?

సం—లేదులేదు

చతు—ఈరశీదులు చిత్తగింపుడు. (అని రశీదులిచ్చును.)

న్యా—(చదివిచూచి) ఈరశీదులు మీరిచ్చినవేనా?

సం—లేదులేదు. ఇదంతయు ఫోర్జరీ, నావ్రాలుకాదు.

న్యా—యీ భార్యము బైలువడిన క్రిమినల్ సెక్షనుక్రింద విచారింపబడుదువు, నిజము చెప్పుండి,

సం—[ఊరకుండును]

న్యా—అబ్బో! ఇదంతా పెద్దగందరగోళముగా నున్నదే రశీదులు, బజానాలు, అన్నియుజరిగినట్లు మేమునమ్మినాము.

చతు—అయ్యా! నాయక్క యీ కేతవుని పెండ్లియాడ నిష్టములేక యగ్నికాహుతియైనది తన్మయమున వ్రాసిన లేఖ పత్రికలలో ప్రకటింపబడినది తాము చిత్తగింపుడు.

న్యా—[పుస్తకము చదివి] హా! ఎంత విచారకరముగానున్నది.

సూర్య—(తనలో) జ్ఞానవంతుడనై మూఢునిరీతియుక్త యూరకుండరాదు (ప్రకా) అయ్యా! నా అభిప్రాయము మనవిచేసెదను.

న్యా—ఏదియో చెప్పుము.

సూర్య—నిజముగ నేను భార్యకమ్ముడుపోయిన దాసుడనే. ఇందతుత్త మొంతమాత్రము లేదు. నాతండ్రి యైదువేలకు నన్నమ్మెను మొదటినుండియు తండ్రి దురాలోచనమునబడి నేనిట్లు కోర్టులకెక్క భార్యనెక్కించితిని,(చతురమతినిజూచి) సుందరీ

గీ॥ తండ్రికపటంబులోబడి ♦ తరుణినిట్లు
కోర్టుకెక్కగా జేసిన ♦ కుటిలమతిని
నాదు నేరములెల్ల మ ♦ న్ననముచేయు
నీవె యర్హురాలవుసుమీ ♦ నీరజాక్షి

(అని భార్యచేయిపట్టుకొనును.)

న్యా—మేము తీర్పుచెప్పదలచిన దంతయు నీవే చెప్పితివి కావుననీబుద్ధి విశేషమునకు సంతసించితిమి. మీరలన్యోన్య ప్రేమంబున వర్ధిల్లి ముందు సంతానమునకు మార్గదర్శకులుగండు.

చ. కొడుకుల గూతులం గనుచు ♦ గొప్పగ వంశము విస్తరింపగా
బుడమిని నెల్లవారలకు ♦ మోదమొసంగి వివాహ ముందునన్
విడువుడికట్నమన్ననుడి ♦ బీదలు సాదలు దుష్కృతంబులో
బడకను మంచిమార్గమున ♦ వర్తిలుడయ్య శుభంబులొందగన్

సం—ఓరి భ్రష్టా! తండ్రిని దూఱనాడి యాలిప్రక్క జేరితివా? నలుగురిలో నాకు నిందఘటించితివా? ఛీ! నీముఖము చూడరాదు. (యోచించి తనలో) ఋజువాఁడైనను వీని సౌజన్య సంపత్తి నాకు లేకపోయెను. పెక్కు దీపములార్పితిని అనేక దుష్కర్మలొనరించితిని. గుడ్డిగవ్వయైన స్రియుసగుపక ధనంబుగూర్చితిని తుదకుసభలో నిందార్హుఁడనైతిని ఛీ! ఛీ!! ఎందుకు నా బ్రతుకు, భార్యయూ నిందించుచున్నది. కుమారుఁడూ గర్హించుచుండెను. కోడలు మొదటికే మోసము తెచ్చినది. నలుగురిలో నవమానపడి గడించిన దెవరికొరకు పేం[illegible]కొరకే గదా? ఇప్పటికి జేసిన దుష్క్రితనివృత్తికై పరమేశ్వరుని బ్రార్థించుచు సుఖంబున నాజీవితము గడపెదను నాకుధనంబుతో పనిలేదు.

యస్యస్మరణమాత్రేణ జన్మసంసార బంధనాత్
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే

కావున కోర్టువారి సమక్షమున వీఁకచ్చివేసెదను. (న్యాయాధిపతిని జూచి) న్యాయమూర్తి! సకలధర్మస్వరూపులగు తమ సమక్షమున నాజేయువిన్నప మాలకింపుడు, (చతురమతి చేతులుబట్టుకొని)

చ. దురితములాచరించితిని ♦ దుర్భరమైన ధనంపుతృష్ణచే
బరమునుగాంచనైన కను ♦ పాపము జేసితి దుష్టబుద్ధినై
తిరిగితి, నాదుసంపదన ♦ దీనమొనర్చితి నింక నుండియో
తరుణి! సమస్తముం గొనుచు ♦ తాలిమి మమ్ముల జూడుమింపునన్

ఈధనదాన్యము విళ్ళువాకిళ్ళు సమస్తము నీకిచ్చితిని, ఇందుసఖము ధర్మ
కార్యములకు వినియోగించి మిగిలినదానితో సుఖంబుందము
రమ్ము

న్యా—మంచిపని జేసితివి. అమ్మాయీ! చతురమతీ! దైవము నీయం
దుండెను, సర్వమనుకూలమయ్యె. ఇక నేమి కావలెను.

చతుర—పరమేశ్వరుడయు చే సర్వము సంపన్నమయ్యె. విననిట్లగుగాక

మ॥ యశముంగాంతురు గాంతలోకమున న ♦ న్యాయంపు మర్యోజనా
వశముంబోక సమస్తపూరుషు సు ♦ స్వాంతంబులంబొల్చి, స
ద్యశముంగాంతురి సతీజనంబుమగలం ♦ దన్యోన్యరాగాత్తలై
శశితారార్కము వేంకటేశ్వరకృతై ♦ శ్వరోన్నతింబొల్చుచున్

న్యా—తథాస్తు

(అందఱు నిష్క్రమింతురు)

(ఇది పంచమాంకము)

సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.



# రసపుత్రవిజయము

(మహానాటకము)

గ్రంథకర్త- ద్రోణంరాజు సీతారామారావుగారు.

ఇది విపులాదేవి నవలననుసరించి మిగుల రసవంతముగా వ్రాయబడిన చారిత్రకమైన నాటకరాజము- రాజమహేంద్రవర చింతామణీనాటకసమాజముయొక్క రు కీర్తిశేషులైన అల్లక చంద్రశేఖరము గారిచే రచియింపబడిన కీర్తనలతో విరాజిల్లుచున్నది- వెల 1-0-0

# తానీషా

(గోలుకొండ రాజ్యవినాశనము)

గ్రంథకర్త- దూబగుంట వెంకటరమణయ్యగారు

పండితవర్యుల సదభిప్రాయములతో విరాజిల్లుచున్నది 172 పే. జీ- గ్లేజు కాగితం వెల 1—0—0

# సంగీత చంద్రకాంత

గ్రంథకర్త- కొడాలి సత్యనారాయణరావుగారు

ఇది అనేకనాటక సమాజములచే ప్రదర్శించిన కథగావున యిందు బొందుపర్పలేదు- వెల 0—12—0

# శారదావిజయం

గ్రంథకర్త- కొడాలి సత్యనారాయణరావుగారు

ఇందు శారదా మాధవులు పెక్కుకష్టములకులోనై చివరకు సౌఖ్యదశ ననుభవింతురు- ఇతివృత్తము చక్కగా పోషింపబడినది-

వెల 0—12—0

వలయువారు:—

టి. వి. రమణయ్య అండు బ్రదర్సు,

నేషనల్ బుక్కు డిపో,

రాజమండ్రి.

# వాసవకన్యకా పురాణము.

ఇది పూర్వకృతి. శ్రీశాలంకాయన మునిచే సంస్కృతములో రచియింపఁబడిన గ్రంథము. తెనుగులిపితో టీకాతాత్పర్యసహితము. విపులముగా వ్రాయఁబడినది. ప్రతివైశ్యుని గృహమందును అలంకరించదగ్గ గ్రంథము ఈగ్రంథము వైశ్యులకు ధర్మశాస్త్రము వంటిది ఇందు వైశ్యధర్మములు చక్కఁగాఁ బ్రతిపాదింపఁబడినవి. ఈకాలమున వైశ్యులలో చాలామంది కులగోత్రఋష్యాదులను తెలియఁజాలక చాలాచిక్కులు పడుచుండుట యెల్లరకు విదితమే. ఆకొఱత ఈగ్రంథము తీర్చును, అనిమేము నిరూపింపగలము. వెల. 1—8—0 మంచికాగితములతో రాయలు ⅛ సయిజులో 124 పేజీలగ్రంథము.

## చాయాపరము.

చక్కని అపరాధపరిశోధక నవల. వెల. 0—6—0

## మహానంద.

గ్రంథకర్త:—కొడాలి సత్యనారాయణరావుగారు.

ఇది భక్తిరస ప్రధాననాటకరాజము. శివస్తోత్రములు శ్రవణానందకరములు పద్యములు రసవంతములు భావములు అత్యద్భుతములు ఎందరో రచియించిరి కాని ప్రదర్శనార్థమై ఎన్నియో నాటకసమాజములు వారీనాటకమునే ప్రదర్శించుచున్నందున మేము వేరుగా వ్రాయనేల.

వెల. 0—12—0

వలయువారు

టి. వి. రమణయ్య అండు బ్రదర్సు,

నేషనల్ బుక్కుడిపో,

రాజమండ్రి.

